# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామ శాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 16-10-1979 | సంచిక 24

—* ఈ సంచికలో *—



1—11—79 వార్షిక సంచికలో 1 ఆరుద్ర చిత్రించిన మధ్యతరగతి జీవితం, 2 సాహిత్యప్రక్రియగా కథానిక, 3 రాయప్రోలు గుడిపాటి, 4 చిలుకూరి నారాయణరావుగారి ఆంధ్రభాషాసేవ, 5 బాపిరాజుగారి అసంపూర్ణనవల మధురవాణి, 6 వటవృక్ష వర్ణన ధూర్జటి కృష్ణరాయలు, 7 శ్రీమద్రామాయణ కల్పవృక్షము, 8 నాదయోగి, మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

తెలుగువ్యాకరణ గ్రంథమును సంస్కృతమున రచించెను.

**కాకతీయులు** :- ఋగ్వేద వ్యాఖ్యాత యగు నృసింహుడను కవి వరంగల్లు కోటలోని కొన్ని శాసనములను రచించెను. వరంగల్లులోని శిలాంకితము లైన ఎన్నో అసంపూర్ణ కావ్యములను గాంచినవారికి కాకతీయులకు గల సంస్కృత భాషానురక్తి తెలియును. వరంగల్లులోని ఒక గుట్టపై అరువది శార్దూల విక్రీడిత శ్లోకములు చెక్కబడి యున్నవి. ఇందు సిద్ధ దంపతుల ప్రణయగాథ కడు మనోహరముగా వర్ణింపబడినది.

గణపతి దేవుని సేనాని జాయప 'నృత్త రత్నావళి' యను నాట్య శాస్త్రము రచించెను. వ్యాకరణ బ్రహ్మ యని పేర్గాంచిన ప్రతాపరుద్రుని ప్రధాని గన్నయ కుమారుడు పాణినీయ వ్యాకరణమునకు వ్యాఖ్యానము వ్రాసె నందురు.

ప్రతాపరుద్రుని ఆస్థానకవులలో ముఖ్యుడు విద్యానాథుడు. ఈతడు రచించిన ప్రతాపరుద్ర యశోభూషణము అను లాక్షణిక గ్రంథము సర్వ పండిత సమ్మతమై, ప్రామాణికమై యున్నది. డెబ్బదినాల్గు కావ్యములు రచించిన అగస్త్యుడు ఈ కాలములోని వాడు. అగస్త్యుడు, విద్యానాథుడు ఒకరే యని కొందరి మతము. మహాభారత గాథను నాటక రూపమున రచించి గంగాధరుడు వాసికెక్కెను. విశ్వనాథుడు 'సౌగంధికాపహరణ' మను మనోహర కావ్యము రచించెను. సోమనాథ భాష్యము, రుద్రభాష్యము పాల్కురికి సోమనాథుని సంస్కృత పాండితీ పటిమను చాటుతుంది. ఈతడు పంచప్రకార గద్య, నమస్కార గద్య, అక్షరాంక గద్య, మొదలగు ప్రక్రియావిశేషములను తెనుగు నుంచి సంస్కృత వాఙ్మయ ప్రపంచమున ప్రవేశపెట్టెను.

**రెడ్డిరాజులు** :- రాజులు సామాన్యముగా కవులను పోషింతురు. కాని రెడ్డి యుగమునందు రాజులే కావ్య నిర్మాతలై గొప్ప గొప్ప కావ్యములు వెలయించిరి. కుమారగిరి రెడ్డి వసంతరాజీయ మను నాట్యశాస్త్రమును, కాటయవేమ విభుడు 'కుమారగిరి రాజీయ' మను పేర కాళిదాసుని నాటకములకు వ్యాఖ్యానమును రచించిరి.

పెదకోమటి వేమారెడ్డి వామన భట్ట బాణుడను సంస్కృత కవిని పోషించెను. ఇతడు సంస్కృతములో కొన్ని నాటకములను, వీరనారాయణ చరిత్రమును వ్రాసెను. సర్వజ్ఞ సింగ భూపాలుడు సంస్కృతమున 'రసార్ణవ సుధాకర' మను అలంకార శాస్త్రమును వెలయించెను. ఇతని ఆస్థానమున విశ్వేశ్వరుడు, అప్పయార్యుడు అను విద్యావేత్తలు నివసించిరి.

**విజయనగరము** :- విజయనగర ప్రభువులు సంస్కృతమును కూడ చక్కగా పోషించిరి. కృష్ణరాయలు స్వయముగా సంస్కృత కవి. 'మదాలస చరిత్రము, సత్యావధూ ప్రీణనము' మొదలగు కావ్యములు రచించినది ఈ నరేంద్రుడే. రాయల ఆస్థానమున లొల్ల లక్ష్మీధర పండితుడు అను కవి నివసించెను. ఇతడు 'శివానంద లహరి'కి వ్యాఖ్య వ్రాసెను. దైవజ్ఞ విలాస మను నొక అపూర్వ గ్రంథమును కూడ ఇతడు రచించెను. ఈ గ్రంథము విజ్ఞానసర్వస్వ మని • పండితుల తలంపు. రాయలమంత్రి తిమ్మరుసు అగస్త్యభారతమును వ్యాఖ్యానించెను. అతని మేనల్లుడు నాదెండ్ల గోపన ప్రబోధచంద్రోదయమునకు టీక వ్రాసెను.

విజయనగర యుగమున కవులే కాక కవయిత్రులు కూడ జనించుట గమనించదగిన విశేషము. ఆనాటి కవయిత్రులలో వరదాంబికా పరిణయమును రచించిన తిరుమలాంబయు, మధురా విజయ రచయిత్రి గంగాదేవియు ప్రశంసార్హులు. వరదాంబికా పరిణయము పెక్కు చారిత్రకాంశములకు నిధి. మధురా విజయము చక్కని కావ్యము.

విజయ నగర సంస్థాపకులలో నొకడైన మాధవ విద్యారణ్యస్వామి 'సంగీత సార'ను శాస్త్ర గ్రంథమును వెలయించెనట. ప్రౌఢదేవరాయలు సారంగదేవుని 'సంగీత రత్నాకరము' నకు వ్యాఖ్యవ్రాసిన మల్లినాథుని పోషించెను.

విజయనగర మంతరించిన పిదప ప్రకాశించిన రాజ్యములలో తంజావూరు, మధుర రాజ్యములు ప్రధానమైనవి.

తంజావూరు నేలిన రఘునాథ నాయకుడు మహాపరాక్రమ వంతుడే కాక ఆరితేరిన విద్వాంసుడు కూడా. గోవింద దీక్షితుడు వ్రాసిన 'సంగీతసుధ' రఘునాథ కృతమే యను వాదము కలదు. గోవింద దీక్షితుని కుమారుడైన యజ్ఞనారాయణ దీక్షితుడు రఘునాథుని శిష్యుడు. ఇతడు 'సాహిత్యరత్నాకరము,' 'అలంకార రత్నాకరము ఆదిగా గల గ్రంథములకు కర్త. ఇట్టివాని గురువైన రఘునాథుని పాండితీ ప్రాభవమును పొగడ నక్కరలేదు. రుక్మిణీ పరిణయము, ఆనందరాఘవము, రచించిన రాజచూడామణి ఇతని ఆస్థానకవి. రఘునాథుని వర్ణించుచు సంస్కృతమున రఘునాథాభ్యుదయమును వ్రాసిన రామభద్రాంబయును, రఘునాథ కృతమైన ఆంధ్ర రామాయణమును సంస్కృతీకరించిన మధురవాణియు పొగడదగినవారు.

మధురనాయకులు నీలకంఠ దీక్షితుని పోషించిరి. ఇతడు నీలకంఠ చంపువు అను గ్రంథము వ్రాసెను. ఇతని సోదరుడు అప్పయదీక్షితుడు 'ప్రాకృత మణిదీపము' ను సంస్కృతమున వెలిగించెను.

రాజు లంతరించిన పిదప సారస్వత పోషణ బాధ్యతను సంస్థానాధీశులు స్వీకరించిరి. విజయనగరము (విశాఖ జిల్లా), పిఠాపురము (గోదావరిజిల్లా) నూజివీడు (గుంటూరు జిల్లా) గద్వాల,

తెలుగువ్యాకరణ గ్రంథమును సంస్కృతమున రచించెను.

**కాకతీయులు :–** ఋగ్వేద వ్యాఖ్యాతయగు నృసింహుడను కవి వరంగల్లు కోటలోని కొన్ని శాసనములను రచించెను. వరంగల్లులోని శిలాంకితములైన ఎన్నో అసంపూర్ణ కావ్యములను గాంచినవారికి కాకతీయులకు గల సంస్కృత భాషానురక్తి తెలియును. వరంగల్లులోని ఒక గుట్టపై అరువది శార్దూల విక్రీడిత శ్లోకములు చెక్కబడియున్నవి. ఇందు సిద్ధ దంపతుల ప్రణయగాథ కడు మనోహరముగా వర్ణింపబడినది.

గణపతి దేవుని సేనాని జాయప 'నృత్తరత్నావళి' యను నాట్యశాస్త్రము రచించెను. వ్యాకరణ బ్రహ్మయని పేర్గాంచిన ప్రతాపరుద్రుని ప్రధాని గన్నయ కుమారుడు పాణినీయ వ్యాకరణమునకు వ్యాఖ్యానము వ్రాసెనందురు.

ప్రతాపరుద్రుని ఆస్థానకవులలో ముఖ్యుడు విద్యానాథుడు. ఈతడు రచించిన ప్రతాపరుద్ర యశోభూషణము అను లాక్షణిక గ్రంథము సర్వ పండిత సమ్మతమై, ప్రామాణికమై యున్నది. డెబ్బదినాల్గు కావ్యములు రచించిన అగస్త్యుడు ఈ కాలములోని వాడు. అగస్త్యుడు, విద్యానాథుడు ఒకరే యని కొందరి మతము. మహాభారత గాథను నాటక రూపమున రచించి గంగాధరుడు వాసిగాంచెను. విశ్వనాథుడు 'సౌగంధికాపహరణ' మను మనోహర కావ్యము రచించెను. సోమనాథ భాష్యము, రుద్రభాష్యము పాల్కురికి సోమనాథుని సంస్కృత పాండితీ పటిమను చాటుతుంది. ఈతడు పంచప్రకార గద్య, నమస్కార గద్య, అక్షరాంక గద్య, మొదలగు ప్రక్రియా విశేషములను తెనుగు నుంచి సంస్కృత వాఙ్మయ ప్రపంచమున ప్రవేశపెట్టెను.

**రెడ్డిరాజులు :–** రాజులు సామాన్యముగా కవులను పోషింతురు. కాని రెడ్డి యుగమునందు రాజులే కావ్య నిర్మాతలై గొప్ప గొప్ప కావ్యములు వెలయించిరి. కుమారగిరి రెడ్డి వసంతరాజీయమను నాట్యశాస్త్రమును, కాటయవేమ విభుడు 'కుమారగిరి రాజీయ' మను పేర కాళిదాసుని నాటకములకు వ్యాఖ్యానమును రచించిరి.

పెదకోమటి వేమారెడ్డి వామన భట్ట బాణుడను సంస్కృత కవిని పోషించెను. ఇతడు సంస్కృతములో కొన్ని నాటకములను, వీరనారాయణ చరిత్రమును వ్రాసెను. సర్వజ్ఞ సింగ భూపాలుడు సంస్కృతమున 'రసార్ణవ సుధాకర' మను అలంకార శాస్త్రమును వెలయించెను. ఇతని ఆస్థానమున విశ్వేశ్వరుడు, అప్పయార్యుడు అను విద్యావేత్తలు నివసించిరి.

**విజయనగరము :–** విజయనగర ప్రభువులు సంస్కృతమును కూడ చక్కగా పోషించిరి. కృష్ణరాయలు స్వయముగా సంస్కృత కవి. 'మదాలస చరిత్రము, సత్యావధూ ప్రీణనము' మొదలగు కావ్యములు రచించినది ఈ నరేంద్రుడే. రాయల ఆస్థానమున లొల్ల లక్ష్మీధర పండితుడు అను కవి నివసించెను. ఇతడు 'శివానంద లహరి'కి వ్యాఖ్య వ్రాసెను. దైవజ్ఞ విలాస మను నొక అపూర్వ గ్రంథమును కూడ ఇతడు రచించెను. ఈ గ్రంథము విజ్ఞానసర్వస్వ మని • పండితుల తలంపు. రాయలమంత్రి తిమ్మరుసు అగస్త్యభారతమును వ్యాఖ్యానించెను. అతని మేనల్లుడు నాదెండ్ల గోపన ప్రబోధ చంద్రోదయమునకు టీక వ్రాసెను.

విజయనగర యుగమున కవులే కాక కవయిత్రులు కూడ జనించుట గమనించ దగిన విశేషము. ఆనాటి కవయిత్రులలో వరదాంబికా పరిణయమును రచించిన తిరుమలాంబయు, మధురా విజయ రచయిత్రి గంగాదేవియు ప్రశంసార్హులు. వరదాంబికా పరిణయము పెక్కు చారిత్రకాంశములకు నిధి. మధురా విజయము చక్కని కావ్యము.

విజయ నగర సంస్థాపకులలో నొకడైన మాధవ విద్యారణ్యస్వామి 'సంగీత సార'ను శాస్త్ర గ్రంథమును వెలయించెనట. ప్రౌఢదేవరాయలు సారంగదేవుని 'సంగీత రత్నాకరము' నకు వ్యాఖ్య వ్రాసిన మల్లినాథుని పోషించెను.

విజయనగర మంతరించిన పిదప ప్రకాశించిన రాజ్యములలో తంజావూరు, మధుర రాజ్యములు ప్రధానమైనవి.

తంజావూరు నేలిన రఘునాథ నాయకుడు మహాపరాక్రమవంతుడే కాక ఆరితేరిన విద్వాంసుడు కూడా. గోవింద దీక్షితుడు వ్రాసిన 'సంగీతసుధ' రఘునాథ కృతి మే యను వాదము కలదు. గోవింద దీక్షితుని కుమారుడైన యజ్ఞనారాయణ దీక్షితుడు రఘునాథుని శిష్యుడు. ఇతడు 'సాహిత్యరత్నాకరము,' 'అలంకార రత్నాకరము ఆదిగా గల గ్రంథములకు కర్త. ఇట్టివాని గురువైన రఘునాథుని పాండితీ ప్రాభవమును పొగడ నక్కరలేదు. రుక్మిణీ పరిణయము, ఆనందరాఘవము, రచించిన రాజచూడామణి ఇతని ఆస్థానకవి. రఘునాథుని వర్ణించుచు సంస్కృతమున రఘునాథాభ్యుదయమును వ్రాసిన రామభద్రాంబయును, రఘునాథ కృతమైన ఆంధ్ర రామాయణమును సంస్కృతీకరించిన మధురవాణియు పొగడదగినవారు.

మధురనాయకులు నీలకంఠ దీక్షితుని పోషించిరి. ఇతడు నీలకంఠ చంపువు అను గ్రంథము వ్రాసెను. ఇతని సోదరుడు అప్పయదీక్షితుడు 'ప్రాకృత మణిదీపము' ను సంస్కృతమున వెలిగించెను.

రాజ్యా లంతరించిన పిదప సారస్వత పోషణ బాధ్యతను సంస్థానాధీశులు స్వీకరించిరి. విజయనగరము (విశాఖ జిల్లా), పిఠాపురము (గోదావరిజిల్లా) నూజివీడు (గుంటూరు జిల్లా) గద్వాల,

జటప్రోలు (పాలమూరుజిల్లా) మొదలైన సంస్థానములు ప్రధానమైనవి.

విజయనగర సంస్థానమును పూసపాటి క్షత్రియులు పాలించిరి ప్రఖ్యాతి వహించిన నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రి గారు వీరి ఆస్థానకవి. ఇతడు సమాస కుసుమావళి ఆదిగాగల వ్యాకరణ గ్రంథములను వెలయించెను. విభక్తి విలాసమున లక్ష శ్లోకములలో విజయరామ గజపతిని కీర్తించెను. ఇతడు "సునీతి సన్నుతీయ" మను తర్కశాస్త్రమును, గీతాభాష్యమును కూడ రచించెను.

విజయనగరాధిపతులలో ప్రసిద్ధుడైన ఆనందగజపతి స్వయముగా పండితుడు. ఇతనికి గురువైన భాగవతుల హరిశాస్త్రి వాక్యార్థ దీపికయను పరిభాషేందు శేఖర వ్యాఖ్యను, చిత్రప్రభ యను పేర శబ్దరత్నమున కొక ఉపవ్యాఖ్యానమును రచించెను.

ఆదిభట్ల నారాయణదాసుగారు గొప్ప హరికథకులే గాక సంస్కృత పండితుడును, కవియునై యుండెను. ఇతడు ఉమర్ ఖయ్యాంను సంస్కృతము లోనికి అనువదించెను. మరికొన్ని కావ్యములు కూడ రచించెను. విజయనగర రాజుల ఆదరణము బడసినవారిలో తాతా సుబ్బరాయ శాస్త్రిగారు, పరవస్తు వెంటరంగాచార్యులుగారు ప్రసిద్ధులు.

పిఠాపురము నేలిన వెలను ప్రభువుల ఆస్థానమున కూచిమంచి తిమ్మనకవియుండి "సుజనమనః కుముద చంద్రిక" యను గద్యప్రబంధమును వ్రాసెను. ఇంకా వీరి ఆస్థానమున "చాటుధారా చమత్కార సారమును" వ్రాసిన అల్లంరాజు సుబ్రహ్మణ్య కవి, దేవులపల్లి సోదరులు, అవసరాల పద్మరాజు నివసించిరి. నూజవీడు ప్రభువైన శోభనాద్రి అప్పారావు స్వయముగా సంస్కృత కవియై "రాజ్యలక్ష్మీ పరిణయ" మను నాటకము వ్రాసెను. వీరి ఆస్థానమున "అప్పరాయ యశశ్చంద్రోదయ" కర్తయగు అనివిళ్ళ వెంకటశాస్త్రి "సాహిత్యకల్పద్రుమము" కర్తయగు నారాయణ పండితుడు మున్నగు గొప్పగొప్ప పండితులు, లాక్షణికులు నివసించిరి.

గద్వాల సంస్థానము సంస్కృతవిద్యా పోషణమునకు మిక్కిలి పేరు గడించినది. వీరి ఆస్థానమున నున్న రాయలూరు కందాళార్యుడు అలంకార శిరోభూషణమును, తిరుమలాచార్యుడు 'కళ్యాణ పురంజయ' మను నాటకమును రచించిరి.

జటప్రోలు సంస్థానాధీశులకడ నివసించిన కృష్ణమాచార్యుడు "శ్రీ కృష్ణ చంపువును" రచించెను. సురభి జగన్నాథ రావు కొలువున నున్న హోసుదుర్గం కృష్ణమాచార్యులు లక్ష్మీవిలాస చంపువు"ను రచించెను.

ఇలా ఇంకెందరో వివిధ సంస్థానాధిపతులు, చక్రవర్తులు సంస్కృత విద్యా వ్యాప్తికి కృషి చేసిరి.

---

# 'ఇన్‌ఖిలాబ్' కవి ఇఖ్బాల్

— శ్రీ వఝ్ఝ విజయరావ్.

ఉర్దూసాహితీ ఆకాశంలో గాలిబ్ తరువాత అంతటి మహోన్నతికి తగిన కవి సర్ మహ్మద్ ఇఖ్బాల్ ఒక్కడే. గాలిబ్ కవిమాత్రమే; ఇఖ్బాల్ మాత్రం కవి, దార్శనికుడు, తత్వవేత్తకూడా. ఎన్నో నిగూఢమైన తత్వాలను లోనారసి కావ్య స్వరూప మహోన్నత కళాకృతుల నందించాడు.

ఇఖ్బాల్ సాహిత్యరంగములో ప్రవేశించేనాటికి ఉర్దూ సాహిత్యంపై భక్తివాదము, భావవాదాల ప్రభావం తగ్గుముఖంగా ఉన్నా ఇంకా కొనసాగుతూ ఉండేది. "గజల్" తో పాటు "నజిం" ప్రక్రియకూడా అభివృద్ధి చెందుతూ ఉన్నది. ఇఖ్బాల్ వంటి మహాకవి రంగ ప్రవేశము చేసినతరువాత 'నజిం' ప్రక్రియ ఇంద్ర ధనుస్సులా హృదయ రంజకతను ఆలోచనా నవ్యతను సంతరించుకొని ఉర్దూకవిత్వాన్ని అమాంతం అత్యున్నత శిఖరారోహణ చేయించింది.

"కళ కళకోసం కాదు, జాతిసౌభాగ్యం కోసం" అని నమ్మి ప్రచారంచేసిన కవి ఇఖ్బాల్. ఆ మన కవిత్వంలో సామ్రాజ్యవాద వ్యతిరేకత, సామాన్యునికి అభిషిక్తత, కనిపిస్తాయి. అందరూ అనుకొనే విధంగా నన్నుకూడా కవిగా లెక్కిస్తుంటే నేను కవిని కాను, అంటాడు. ఇఖ్బాల్ కవితాకళను ఎరిగినవాడు. తన కవిత్వంలో దాన్ని చాటినమహాకవి. అంతే కాని భాషను విగ్రహంగా పూజించే వాడు కాడు. "భాష భావ ప్రకటనా సాధనంమాత్రమే. సర్వమూ కాజాలదు.

"పాటకసలు భాషలేలా !
మరి ఆభాషలేమిటో నేనెరుగను
భారతీయము పారసీకము
ఏదైననేమిటి ఎదను మీటే
సాధనమైనచో చాలదే మరి"

ప్రజలను చైతన్యరహితులను చేసి వ్యక్తిత్వాలను మానవత్వాన్ని చంపే కవిత్వాన్ని, కళను, దరిదాపులకు రానీయక

"మానవుని దృష్టినుంచి
మహోన్నతి స్థానాలు దాచివేస్తారు
ఆత్మను నిద్రబుచ్చుతారు
శరీరాన్ని మేల్కొల్పుతారు"

అంటాడు.

కన్ను శరీరాంగాలకు జీవితానికి వెలుగు చూపుతుంది. కన్నులాంటివాడు కవి. తీక్ష్ణ దృష్టికల కవి

జాతికి దేశానికి
మనుషులంతా వివిధ అంగాలైతే
కనజాలినట్టి కన్నేకవి
ఏఅంగానికి ఏబాధకలిగినా
ఏడ్చేదొక్క కన్నే గాదామరి ?”
అంటాడు.

దేశప్రేమ వశీభూతుడై దారిద్ర్యాన్ని, సామాన్యుని రక్తాశ్రువులను తనకవితలో స్పృశిస్తూ ప్రకృతియే కాదు దేశందేశమే పవిత్రమైన దంటాడు.

“మట్టి బొమ్మల్లో దేవుడున్నాడని
భ్రమసే పిచ్చివాడా!
నాదేశపు ప్రతిఅణువు
నాకు దేవతేసుమా !”
అంటాడు.

ఇఖ్బాల్ ను మలుపుత్రిప్పినరోజులుగా లెక్కించాలంటే అతను యూరప్ లో గడపిన మూడుసంత్సరాలను లెక్కించుకోవాలి. అక్కడ విద్య నభ్యసించి “ఇరాన్ దార్శనికత” పైని పరిశోధనచేసి జర్మనీలోని మ్యూనిచ్ యూనివర్సిటీలో డాక్టర్ డిగ్రీపొందాడు. లండన్ లో బారిష్టర్ చదివాడు. లండన్ యూనివర్సిటీలో పనిచేస్తున్న డాక్టర్ ఆర్నాల్డ్ సెలవు పెట్టగా ఆస్థానంలో కొంతకాలం ఉద్యోగ నిర్వహణ సాగించాడు. ఈ కాలం ఇఖ్బాల్లో నూతన ఆలోచలను కలిగించింది రాష్ట్ర, దేశ, పరిధులనుదాటి విశాలగగనంలా వ్యాపించి విశ్వరహస్యాలను అన్వేషణ చేసేదృష్టి అతనిలో బయలుదేరింది.

ఇఖ్బాల్ లేకుంటే ఉర్దూలోఆధునిక ప్రగతిశీల కవిత్వమే కల్పనాతీతమై ఉండేది. విప్లవానికి పర్యాయ పదమైన “ఇన్ ఖిలాబ్” అనే పదాన్ని “రాజకీయ సామాజిక పరివర్తన” అనే అర్థంలో మొట్టమొదట ప్రయోగించినది. ఉర్దూ సాహితీ ప్రపంచానికి క్రాంతివిషయాన్ని ప్రధానంచేసిందికూడా ఈయనే. “లక్షలాది నక్షత్రాలు ఆత్మార్పణం చేసుకుంటేనే ఈ భూమికి నిండుసూర్యోదయం” అంటూ “రాబోయేతరానికి రాజవు నీవే” నంటూ పాఠకుల్ని ప్రోత్సహిస్తాడు. రైతుకు కూడుపెట్టలేని పొలాన్ని అణువణువూ కాల్చమంటాడు. ఇలాంటివి ఎన్నో. ఇంత భావతీవ్రత విప్లవాత్మకత ఉర్దూలో అంతకుముందు కనిపించదు.

జమీందారు, రైతు, పెట్టుబడిదారు, కార్మికుడు, యజమాని, సేవకుడు, పాలకుడు, పాలితుడు. వీటి సంఘర్షణలపై మొదట కలం పూనినది ఇఖ్బాల్. తరువాతి వారు దీన్ని ఎంతో అభ్యుదయ పథానికి సాగించారు. ఆయన రచనలలో ‘బాంగీదరా’ అనేది కవిత్వగ్రంథం. తరువాత గ్రంథం ‘బాకీజిబ్రేలు’ ఇది తాత్విక-ఆలోచనలు కలిసిన కావ్యం. కవిత్వము తాత్వికత సమపాళ్ళలో కలిసిన గ్రంథం ‘జరచే కలీం’. కవిత్వ విలువలు ఎక్కువగా కలిగి సమకాలీన సమాజానికి అద్దమే కాకుండా యుద్ధప్రకటన లాంటిది ‘అల్మగానే హజామాచ్’. ఇంకా నిగూఢతత్వంతో కూడిన రచనలు ఒక రూపకం, కొన్ని గేయాలు, కొన్ని రుబాయీలు ఉన్నాయి.

కవిత్వంలో తన చింతనాలోతుల్ని త్రవ్వడానికి ఉర్దూ చాలక ఫారశీని ప్రయోగించాడు. ఫారసీ రచనలలో ఈయన భారతదేశాన్ని దాటి ఇరాన్, ఆఫ్గనిస్థాన్, టర్కీ, ఈజిప్టు, దేశాల వరకూ వ్యాపించాడు. చివరిగా ఒకమాట ఇఖ్బాల్ ను ఆయన వాక్యాలలోనే మతవాదిగా ప్రతిపాదింప జూశారు చాలమంది. కాని ఈ దృష్టితో చూస్తే తులసీదాస్, సూరదాస్, టాగూర్, మిల్టన్ వంటి కవులనుకూడా మినహాయించాల్సి ఉంటుంది. ఇఖ్బాల్ మహాకవి నూతన మార్గాలను సృజించి వర్తమానానికి భవిష్యత్తుకు శిరోధార్యుడైనాడు.

—...—

## రచయితలకు

రచనలు ఎంత సంగ్రహాముగానున్న అంత శీఘ్ర ప్రచురణకు వీలగును. అతిదీర్ఘములగుటవలన ప్రముఖుల రచనలు కొన్ని మిక్కిలి ఆలస్యముగా ప్రచురింపవలసి వచ్చుచున్నది. మా పత్రిక పరిమితిని దృష్టిలో ఉంచుకొని మాతో సహకరించుచు యథాప్రకారము పత్రికపై అభిమానము చూపగోరిక.

గ్రంథవిమర్శాత్మక రచనలకు ప్రత్యేక ప్రాముఖ్యముని గమనింప గోరిక.

1-11-79 సంచిక వార్షిక సంచికగా ప్రచురింపబడును.

— సంపాదకుడు.

# శ్రీ త్యాగరాజస్వామి

— శ్రీ



శ్రీ త్యాగరాజస్వామివారి జన్మస్థలము తంజావూరి సమీపమున తిరువాయూరు. ఈయన పితృదేవులు కాకర్ల రామబ్రహ్మముగారు. తల్లి సీతమ్మగారు. రామబ్రహ్మముగారి తాతగారి కాలమునందు ఈ వంశీయులు తిరువాయూరున కేతెంచిరి. కాకర్లయనునది కర్నూలు జిల్లాలోని గ్రామము. రామబ్రహ్మముగారి తండ్రిగారైన గిరిరాజకవి యక్షగానములను విరచించిరి. రామబ్రహ్మముగారు నిరుపమాన రామభక్తులు. త్యాగరాజుగారి తల్లి శ్రావ్యముగా రామదాసు కీర్తనామృతమును గ్రోలుచుండెడిది. ఆమె తండ్రి వీణ కాళహస్తయ్యగారు గొప్ప సంగీతవిద్వాంసులై యుండిరి. ఈ విధమున ఉభయకుటుంబ సంప్రదాయములు సమ్మేళనమునొంది శ్రీ త్యాగరాజస్వామి వారిలో శ్రీరామచంద్రమూర్తి యెడలను, సంగీతసాహిత్యముల యెడలను అపారభక్తి, అత్యంతానురక్తిగా దివ్యతేజమున భాసించినవి.

దివ్యపుష్పము జననమాదిగా తన దివ్య సౌరభ్యమును, దశదిశాంత విశ్రాంతమొనరించు విధమున బాల్యమునందే వీరితండ్రిగారితో తిరువయ్యూరు వచ్చేసి సంస్కృతాంధ్రములు, సంగీత, జ్యోతిషమంత్ర శాస్త్రములు నవలీలగా నభ్యసించుట వీరి అసమాన ప్రతిభను సహస్ర ముఖముల విశదమొనరించును. సుప్రసిద్ధ రామభక్తులగు వీరు సంగీతశాస్త్రగ్రంథములనన్నింటిని తమలో జీర్ణించుకొని రనుట అతిశయోక్తిగాదు. బాల్యముననే శ్రీరామ పూజా సమయమునందు దివ్యనామ సంకీర్తన గానముచేయు అప్రతిమాన దివ్యశేముషీధురంధరులు శ్రీ త్యాగరాజులు వీరి ప్రథమ సంకీర్తన 'నమో నమో రాఘవాయ' అనునది. పరమభక్తాగ్రగణ్యులగు శ్రీత్యాగరాజ స్వామివారు రామతారక మంత్రోపదేశమొంది 96 కోట్లు రామనామ జపమొనరించి పరమపావనులై శ్రీరామ సాక్షాత్కారమును గాంచిన దివ్యపురుష.

ఈయన మొదట తనకు దర్శనమొసంగిన శ్రీరామచంద్రమూర్తి దివ్యమంగళ దేహమునే 'ఏలనీదయరాదు', 'అలకలల్లలాడగగని', 'శ్రీరామ జయరామ' మున్నగు కృతులలో వర్ణించిరని ప్రతీతి. అభినవ వాల్మీకు లనదగిన శ్రీత్యాగరాజ స్వామివారు ఇరువదినాలుగువేల కృతులను శ్రీరామాంకితముగా 'త్యాగరాజనుత' యను మకుటముతో రచించి రని విశదమగును. అయ్యెను నేడు వేయికీర్తనలవరకే లభ్యములు. వీనిలో 590 వరకు వర్ణమెట్లు కలిగినవి.

శ్రీ త్యాగరాజస్వామి అపూర్వ వైరాగ్యాశీలురు సంపన్నులై, ఉంఛవృత్తి పూర్వక జీవితాధారులై, స్వతంత్రులై, శ్రీరామసేవాధురంధరులై భక్తి పారవశ్యముతో శ్రీ రామచంద్రుని సన్నిధి ననుభవించి, బహుభంగుల, సహస్ర విధముల తన స్వామితో తన్ను గూర్చి విన్నవించుకొని నవినయ ప్రతిభాశాలి. ఈయన కృతులన్నియు ఏకాంత భక్తియుతులైన వీరి అనన్య సామాన్య పవిత్రభక్తి సుధామకరందమును ప్రత్యణువున ప్రకాశితము చేయునట్టి రసమయ సుధాగుళికలే.

శ్రీ త్యాగరాజస్వామి నాదబ్రహ్మోపాసకులై, సంగీతమాధుర్య రసశేవధు లనదగిన అమృతోపమాన రసమయపావనకృతులను సృజించిన సంగీతబ్రహ్మస్వరూపులు. అపూర్వ మహిమాన్వితంబైన నూతనరీతిగా విర్భావము సంగీత ప్రపంచమున వీరు కల్పించిరి. పుంభావ సరస్వతియనదగు వీరు ఉత్సవ సంప్రదాయములోని షోడశోపచారపూజల కనుగుణము లగు కీర్తనలు, భజన సంఘములకుపయుక్తములగు దివ్యనామ సంకీర్తనలు వివిధ రాగాలతో విరచించిన అప్రతిమానధిషణాధికకృత వాచస్పతులు. ఈ రచనలు విషయప్రధానమహితములు. సంగీతమును వీని సమీపముననే ప్రవహించుచుండును అద్వితీయ పాండితీ పండితులగు శ్రీ త్యాగరాజస్వామి సాహిత్యగాంభీర్యము, పదగుంఫనము, తాళజటిలత, గల కీర్తనలను, సంగీత సాహిత్య సమ్మేళనముతో, ప్రౌఢాన్వయంబులై, పండితైక వేద్యములై, హృద్యములై విరాజిల్లు నిరుపమాన శోభాసనాథములగు 'ఘనరాగ పంచరత్నముల'ను; సహృదయ మనోరంజకములగు అద్భుత దివ్యసంగీతశిల్పములను; సృజించిన దివ్య తేజోవిలసిత శిల్పిచక్రవర్తులు.

వాగ్గేయకారావతంసులైన వీరు సాహిత్య శృంఖలాబద్ధమైన సంగీతమును విడిపించి సాహిత్యము నప్రధానముచేసి సంగీతము స్వేచ్ఛా విహార మొనర్చుటకై నూతనములు, సుందరములునైన కృతులను దివ్యభవన రాజములను నిర్మించిరి. సంగీతమును సర్వాంగ సౌందర్యసముపేతముగా నలంకరించిన ధీసంపన్నులు వీరి సంగతులు సంగీత సరస్వతికి ప్రియతమమైన దివ్యరత్నాలంకారములు. ఇవి వీరి కృతులకు జీవమువంటివి. సాహిత్యభావ మెన్ని రీతుల వ్యక్తము చేయవచ్చునో అన్ని విధముల భావానుగుణమగు రాగవిన్యాసములతో గానముచేయవచ్చును.

'ఆరగింపవే పాలారగింపవే' 'ఎన్నగ మనసుకు రాని' 'ఓరంగ శాయి పిలిచితే

'ఎదుట నిలిచితే' 'తులసీ దళములచే సంతోషముగాఁ బూజింతు' 'మరుగేలరా' మొదలగు అసంఖ్యాక కృతులు శ్రీత్యాగరాజస్వామి విరచితానర్ఘ కృతి మణిహారము నందలి దివ్యమణులవలె అద్వితీయ శిల్పసౌందర్యముతో విరాజిల్లుచున్నవి. వివిధ సంగీతరహస్యములు, రాగాలాపన, కృతిరచన, స్వరప్రస్తారము మున్నగునవి త్యాగరాజ కృతులలో సువిదితములు. వీరు వివిధరాగముల కపూర్వప్రశస్తిని కల్గించుచు సంగీతరహస్యములను వివరించి సాహిత్యబంధము నుండి తాళబంధమునుండి సంగీతమును విముక్తము చేసి ఎక్కువగా ఆదితాళమునే ఉపయోగించి కృతి రచనలు చేసిరి. హిందూస్తానీ, పాశ్చాత్యరీతులను గూడ నెరిగిన సర్వజ్ఞులగు శ్రీత్యాగరాజస్వామి నూతన విధానములో రచనలుచేసి కర్ణాటక సంగీతమున కఖండసేవచేసి వాగ్గేయకారావతంసులుగ ఆంధ్రావళికి నిత్యప్రాతః స్మరణీయులై వరణీయులును నైరి.

శ్రీత్యాగరాజ స్వామి మనోధర్మములు, ఆశయములు, మానవత్వము, బహుధా ప్రశంసనీయములు. వీరి నిరుపమాన భక్తి, రసావేశము వీరి కృతులన్నిటను రసగంగా తరంగిణి వలె నుండును సర్వమత సర్వమానవ సమానత్వములతో నిండిన మహోన్నతోపదేశములను వీరిరచనలు ప్రబోధించును. కారణజన్ములు, మహాభక్తాగ్రేసరులును, అపరవాల్మీకులు, నగు శ్రీత్యాగరాజస్వామి ప్రహ్లాదభక్తవిజయము, సీతారామవిజయము, నౌకాచరిత్రము అను మూడు సంగీతనాటకములను విరచించిరి. వీనిలో ముఖ్యముగా నౌకాచరిత్రము సుమధురభక్తి పూరితము, సహృదయహృదయంగమమునైన దివ్య రూపకరాజము.

లోకకల్యాణార్థ మవతరించిన శ్రీత్యాగరాజస్వామి ప్రతిభ సర్వతోముఖమై సహస్రముఖముల దివ్యతేజోవిలసితంబై చతుర్దశ భువనపర్యంతము ప్రసరించి తన దివ్యదీధితులను లోకమునంగు ప్రసరించినది సార్వకాలికమును, నిత్యము, నైన వారి సంగీతము ఆపాత మధురమై, గాయకావతంసులను, శ్రోతలను బ్రహ్మానందాంబుధి నోలలాడించును. శ్రీత్యాగరాజ గురువరేణ్యులు ఆధ్యాత్మిక భావసంపన్నులు, నాదోపాసకులు, సంగీతయోగి వరేణ్యులు. నాదోత్పత్తిక్రమము, ఓంకారనాద విశేషము, నాదబ్రహ్మతత్త్వమును సమగ్రముగా నాకళించుకొనిన వారు శ్రీత్యాగబ్రహ్మము.

వీరు అద్వైత సిద్ధాంతమును వివరించి, మోక్షసాధనలో శాంతము ప్రముఖగుణమని నొక్కివక్కాణించిరి. అపరవాల్మీకులగు శ్రీత్యాగరాజపరబ్రహ్మము వాల్మీకి రామాయణ మందలి వేదాంత సత్యమును తమ రచనల వలన సంబోధముచేసె లోకమునకు మహోపకారము నొనరించిరి. సువిశాల సంగీత సామ్రాజ్యమునకు రాజరాజులైన శ్రీత్యాగరాజస్వామి మహాపురుషులు, మహాపండితులు, నిరుపమాన వాగ్గేయకారావతంసులు, పరమాద్భుత సంగీత ప్రపంచ విరించులు, సంగీత సర్వజ్ఞులు, మహాకవులు, ప్రముఖసంస్కర్తలు, మహాచార్యులు, మహాభక్తులు, అధ్యాత్మతత్త్వవేత్తలు, సంగీతయోగులు ననుట సర్వవిధముల సముచితమై, అన్వర్థమై యొప్పారును. శ్రీత్యాగజస్వామి 'త్యాగోపనిషత్' అను నామమువలన ప్రశంసింపదగిన అనర్ఘకృతి రాజములను సృజించిన 'దివ్యసంగీత చతురానను లను ప్రశంసా వాక్యముతో ఈ వ్యాసమును ముగించుచున్నాను.

— ... —

# రాళ్లపల్లి రచనా రామణీయకత

(గతసంచిక తరువాయి) — శ్రీ కరెవరపు వేంకటరామయ్య, ఎం ఏ.

రాళ్లపల్లి విమర్శలలో వేమన, గ్రంథము విశిష్టము, విలక్షణము. తమ కవిత్వతత్త్వ విచారములో ఆంధ్ర వైమర్శిక పథమును నూత్న గతికి మరలించినారు శ్రీ కట్టమంచి పాశ్చాత్య సంస్కారముతో సాగిన రెడ్డిగారి విమర్శ కొన్ని తావుల భారతీయతను గర్హించు వరకు సాగినది. రాళ్లపల్లి ఈదోషమును తొలగించి ఆంధ్ర విమర్శ వాఙ్మయమును సుసంపన్నం చేశారు కవులపై, వారి కావ్యములపై పాశ్చాత్య సాహిత్యములో వచ్చినన్ని విమర్శ గ్రంథములు మన సాహిత్యములో లేవు. ఆంధ్ర సాహిత్యములో వేమన యెడ ఎంతో నిరాదరణ జరిగినది. సి. పి బ్రౌన్ (C P. Brown) పుణ్యమా అని వేమన పద్యములు ఆంధ్రులకు చాలవఱకు లభించినవి.

కట్టమంచి వారు ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఆధ్వర్యమున 'వేమన' పై వ్యాస పరంపర యేర్పాటు చేసిరి. అందు రాళ్లపల్లి వేమనపై ఏడు ఉపన్యాసముల నిచ్చిరి ఈ వ్యాసములు వారి నిశిత పరిశీలనా దివ్యశక్తికి, నిష్పాక్షిక విమర్శకు నిదర్శనములు రాళ్ళపల్లి వారి 'వేమన' 'తెలుగు వచన వాఙ్మయ భారతి కొక కల్హారమాలిక' (మహా తి. పు. 230). వేమన వ్యక్తిత్వము కాలదేశములు, సంసారస్థితిగతులు. తత్కాల మత ధర్మముల స్థితి, వేమన యోగసిద్ధి – మతప్రచారము, వేమనతో ఇతర కవులకు గల సామ్య వైషమ్యాలు, వేమన కవిత్వము అందలి హాస్యము, నీతులు – అనువానిని గూర్చి శర్మగారు కూలంకషముగ చర్చించి సారాంశమును అందిచ్చి యున్నారు.

ఏమైనను ఆ కుసవలె అర్థము చేసికొన్న వారు అరుదనిన అతిశయోక్తి కాదు. అందుకు ఈ పంక్తులు సాక్ష్యము. 'వేమన ఆంధ్రులలో సాటిలేని వ్యక్తి. అతీంద్రియములైన తత్త్వములను దెలిసికొనవలెనను నాశ, వాని ననుభవ పూర్వకముగ సాధించు సాహసము, తనకు దెలిసిన వానిని నిర్భయముగా బోధించు ధైర్యము, దానికి సాధనమై యిరుప్రక్కలందును మఱుగు లేని మంచిపదను గల చురకత్తి వంటి కవితాశక్తి, దానికి మెఱుగిచ్చునట్టి సంకేత దూషితము గాని ప్రపంచ వ్యవహారములందలి సూక్ష్మదృష్టి, గాయమునందు కత్తికే పూసి కొట్టినట్లు తిట్టుచునే నవ్వించు హాస్యకళలత' - వేమన కవిత్వమును అణువణువునా జీర్ణించుకొనబట్టే, ఈ పంక్తులను వారు వ్రాయగలిగారని చెప్పవచ్చు. అయితే వేమన కాలదేశములు, అతని సిద్ధాంతములు, ప్రక్షిప్తములు-పాఠభేదములు, - ఈ మూడు విషయాలను వారు భావి పరిశోధకులకు వదలినారు. నాటికి వారికి లభ్యమైన సమాచారమంతా సేకరించి హేతుబద్ధముగా విచారించి ఫలితాలను నిర్ణయించక వదిలారు.

కాని నేటికీ వారి నిర్ణయములే ప్రమాణములు. కాని ఒక్క విషయమునను మన పరిశోధకులు ముందడుగు వెయ్యలేక పోయిరి. మన అలసత్వమునకు ఆద్యనిదర్శన మిది. వారి సూచన యిది. 'ఇప్పటికిని బ్రౌను దొర ముద్రణయే సర్వోత్తమమని చెప్పుటకు సిగ్గగుచున్నది. .. అతడు గోసిలి నిండఁ బెట్టినను, పెట్టిన దంతయు మంచి వస్తువైనను అది బిచ్చమే 'వ్రాతప్రతులను, అచ్చుప్రతులను సేకరించి, సంప్రదించి సవిమర్శముగా వేమన్న పద్యముల నూతన ముద్రణ మొకటి వేసి పుణ్యము కట్టుకొందురు గాక' అని ఆశించిన వారి ఆశ నేటికిని అట్లే మిగిలి పోయినది అను నిత్య సాహిత్య పౌరోహిత్యం నెఱపే సాహిత్య సత్య వ్రతులకు, సాహిత్య సంస్థలకు ఇది సిగ్గు చేటు కలిగించే విషయమే మఱి

'సారస్వతాలోకము' ఎనిమిది వ్యాసముల సంపుటి. వీనిలో కొన్ని తొలుత 'సారస్వతోపన్యాసము' లను పేర ప్రకటితములు. ఆపిమ్మట మరి కొన్నింటిని చేర్చి 1954 లో సారస్వతాలోకము అను పేర ప్రచురించిరి. ఇందలి తొలి వ్యాసం 'రాయల నాటి రసికత'. రాళ్ళపల్లి విమర్శవాఙ్మయానికే తలమానిక మీ వ్యాసము. జీవితంలో కాని, సాహిత్యంలో కాని ఆయన అభిరుచులను తలస్ఫూర్తిగా చూపట్టే రచన యిది. ఆయన రాసిక్య రామణీయకత కెత్తిన దివ్యనీరాజనము.' ఆనంద మనునది మనోధర్మము గాని, వస్తు ధర్మము గాదు. ఏ కారణము చేతఁగాని దేనియందు మనస్సు దృఢముగా లగ్నమగునో దాని ననుభవించునపుడు మనకు నిరతిశయానందము గలుగును. అట్టి యానందమును సాధింప ప్రయత్నించుటయే రసికత్వమునకు లక్షణము' అని రమ్యంగా రసికత్వాన్ని నిర్వచించారు.

రాయలనాటి కవుల మనః కర్మాగారములలో ప్రవేశించి తన సూక్ష్మేక్షికతో సామాన్య పాఠకుని మనశ్చక్షువునకు గోచరింపని రాసిక్య సంపద నంతటిని కొల్లగొట్టి కనుల ముందు కుప్పలు పోసినారు అది అనుభవైక వేద్యము. సహజమైన శైలీలాలిత్యముతో పాటు లలిత లాస్యమును నవోఢలా తొంగి చూచును ఆయన రచనలో. చూడుడు.

'హంసతూలికా తల్పము .. ఇది ధనికులలో సామాన్యముగ నుండెను ఇందుకై యెన్ని హంసలను జంపవలసి యుండెనో? అను మాట వేఱు రసిక ప్రపంచమున పాపపుణ్య చర్చ కవ్వ చోటు లేదని మనవి చేసితిని.' (పుట 18). అట్లే ప్రాబంధిక శృంగారముపై చిన్న విసరు' స్త్రీలను వర్ణించు సన్నివేశ మెట్టిదైనను మన కవుల దృష్టి పడకింటిలో వేచియున్న పెండ్లికొడుకు దృష్టియే కాని వేఱుండదు.' (పు. 19). నాటి ప్రజల రాసిక్యమునకు నిదర్శనము 'మేలిపలుకులు' రాయల కాలపు రసికులు తమ ప్రియురాండ్రు ఎడమకాలితో తల దన్నినను 'కాలు నొచ్చెనే! యని బుజ్జగింప వలసినదే కాని కోపించి వదలి పోరాదని తలంచిరి 'అల్పత్వమునకు రసికుల బ్రతుకులలో చోటులేదు' (పు 27) మొత్తము మీద 'విమర్శవల్ల సాహిత్యంలో అభిరుచులు వ్యక్తమౌతాయి' అన్న T S. Eliot పలుకులు ఈ వ్యాసానికి వ్యాఖ్యాన ప్రాయములు.

రెండవ వ్యాసం 'రాయల వైదుష్యము' రాయలమూర్తి, వ్యక్తిత్వమూ, ఇదీ అని పాఠకుల కన్నులకు గట్టిన రచన యిది. తరువాత 'నాచన సోముని నవీనగుణములు' శర్మగారు సోమనాథుని కవితారీతిని ఊచముట్టుగ పరిశీలించి, భావవస్తు రచనా కళలలో వస్తుపద్ధతికి అంతకన్న నవీనముగు శబ్దార్థ రచనా పద్ధతిని, బహుళధా వ్యాప్తికి తెచ్చినాఁడని, అదే అతని నవీన గుణమని సప్రమాణముగ నిరూపించిరి. 'రచన కవిత్వకళకు బహిరంగము ప్రకృతి భావవస్తువు లంతరంగములు. కళావ్యక్తికి భావము జీవమని, వస్తువు బుద్ధియని, రచన శరీరమనియుఁ జెప్ప వచ్చును కాని ప్రధానమైన కళాంతరంగము భావము. దానికి వస్తువును, ఈ రెంటికిని రచనయు పరాధీనములుగ నుండవలయును. అదే యుత్తమకళ' అని వారి నిష్పాక్షిక - తీర్పు, (పుట. 54).

అంతేకాదు, 'భావమెంత తీవ్రముగా సూక్ష్మముగా నుండిన నంత యానందము గలుగును. వస్తువెంత సహజముగా విరివిగా నుండిన నంత తృప్తి గలుగును. రచన యెంత యపురూపముగా కష్టముగా నుండిన నంత యాశ్చర్యము గలు

గును.' (పుట.59) అని కవితా తత్త్వమును స్థూలముగ విశదీకరించిరి. ఆశ్చర్య ప్రధానమగు నాచన సోమనాథుని కవిత్వము ఉత్తమోత్తమము కాదని వీరి నిశ్చయము. దీనిని సహృదయులు అంగీకరింపక తప్పదు.

ఇక 'ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథుని కీయఁదగు స్థానము' అను వ్యాసము వీరి తులనాత్మక విమర్శకు (comparative criticism) ప్రథమోదాహరణము. ఒక కవినిగాని కావ్యమునుగాని తాదృశ కవులతోగాని కావ్యముతోగాని సరిపోల్చి భేదసాదృశ్యముల నరసి హెచ్చుతగ్గులు నిరూపించుట ఈరీతి విమర్శనముయొక్క స్వభావ జీవలక్షణము. విమర్శకతా జీవలక్షణములను సంపూర్ణముగ పుణికిపుచ్చుకొన్న పద్ధతి యిది.

నాచన సోమన ఉత్తరహరివంశమును, ఎఱ్ఱాప్రగడ హరివంశమును తులనాత్మకముగ పరిశీలించిన శర్మగారు ఈ రీతి విమర్శకు ఆంధ్రవిమర్శ వాఙ్మయమున సుష్ఠుస్థానము నేర్పరచి రనుట అతిశయోక్తి కాదు. కల్పనాప్రధానమగు నాలంకారిక శబ్దార్థరచనకు లోబడిన సోమనకు, రసపోషణదృష్టి ఎఱ్ఱనకన్న తక్కువయని శర్మగారితీర్పు. 'రంగనాథ రామాయణము' అనువ్యాసము ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు కట్టమంచి రామలింగారెడ్డి గారి యాజమాన్యమున, పింగళివారి సంగ్రహపీఠికతో ప్రచురించిన రంగనాథ రామాయణముపై సాగిన విమర్శ. ఆప్త మిత్రులగు కట్టమంచి వారి అభిప్రాయములను తుత్తునియలు చేసినారీ వ్యాసములో. ఆయన నిర్భీకతకు, హేతుబద్ధమైన విచక్షణాశక్తికి ఈవ్యాసము ఉదాహరణము.

శుద్ధప్రతిని తయారు చేయుటలో వేటూరి వారుచేసిన కృషిని మరుగుపరచి 'కనీసము'గ పేర్కొనక వదలుట రాళ్ళపల్లివారికి ఎంతోబాధ కలిగించినది. దానిపై 'మతి ప్రభాకరశాస్త్రి గారిది కూడ తెరమఱుఁగు పనియే యైనది. పీఠికలలో వారిపే రుల్లేఖింపఁబడి యుండకపోయినచో వారిదిగూడ 'నిర్నామ' కర్మమేయై యుండెడిది.' (పుట 92)-అని పేర్కొనిరి. కాగా 'నిగమశర్మ అక్క' ఆంధ్ర సాహిత్య ప్రియులకు చిరపరిచితమైన రచన. దానిని గుఱించి వేరుగ వివరింప పనిలేదు కాగా 'తిక్కనతీర్చిన సీతమ్మ' తిక్కన పాత్రచిత్రణ నైపుణ్యమును కూలంకషముగ పరిశీలించి చేసిన రచన. 'త్యాగయ్యగారి నాదసుధారసం' సంగీత సాహిత్యాలలో శర్మగారి నిరుపమాన ప్రభుతకు నిదర్శనము. శ్రీరామభక్తి, కవితా, గానముల త్రివేణీ సంగమమైన త్యాగరాజ నాదసుధారస చషకమును భక్తరసిక పాంథ జనుల కందిచ్చిన ప్రపాశాల ఈవ్యాసము

కాగా రాళ్ళపల్లివారి విమర్శలో మూడవది 'నాటకోపన్యాసములు.' (1931) ఈచిఱుపొత్తములో రెండుభాగములు కలవు బళ్లారిలో జరిగిన ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు గార్ల స్మారకోత్సవమున శర్మగారు చేసిన ప్రసంగములివి. నాటక లక్షణములతో పాటు, పై ఇరువురు నాటకకర్తల రచనల యందలి విశేషములు సువిమర్శముగా తెలుపఁబడినవి. మొదటి వ్యాసమున రాళ్ళపల్లి వారు స్త్రీపాత్రలను స్త్రీలే ధరింపవలయు నను వారి వాదమును తుత్తునియలు చేసిరి. వీరు పైస్వభావ వాదుల వాదమును కళ, నీతి అను రెండు దృక్కోణముల నుండి పరిశీలించిరి.

'ఒక వస్తువు నందలి భిన్న భాగముల వేర్పాటు శాస్త్రము. భిన్న పదార్థముల నొకచోటఁ జేర్చి చేయు కూర్పు కళ' (నా కో. పు.4).' కళకు అనుకరణము సాధనము. సాధ్యము చిత్తైకాగ్రత. దాని ఫలము శాంతి.' (పుట. 13). అని అభిప్రాయము. అట్టి అనుకరణములో స్త్రీపాత్రను స్త్రీయేధరించి ఒప్పించిన అది కళ కాదు. స్త్రీపాత్ర ప్రధానము కాని స్త్రీ కాదని, రసభావముసు ప్రేరేపించుటలోకళ యున్నదికాని వాస్తవానుభూతిలో లేదని శర్మగారి నిష్కర్ష తమవాదమున కుపబలకముగ స్థానం, మైసూరు కాయణాల నుదహరించిరి. ఇక రెండవది నైతికకారణము నేడు ఆంధ్ర నాటక రంగము అధోముఖ మగుటలో ఈ నీతిపాత్ర విస్మరింపరానిది. దీనిని నాడే గుర్తుచేశారు శర్మగారు. నాటకములందలి పద్యపఠనము గురించి విశేషచర్చ చేసినారు. కృష్ణమాచార్యులవారి 'సారంగధర'పై వారు వెలిబుచ్చిన అభిప్రాయములు నేటికిని శిరోధార్యములే.

అవి హారి విమర్శనావిచక్షణతకు,రమ్య హాస్యమునకు నిదర్శనము. చూడుడు. 'ప్రకృతము మనకు మిగిలినది ఆద్యంతము శోకమయమైనది 'సారంగధర' యొక్కటే. కాని పదిశోకాంత నాటకములుచేసినంతపని తెలుగువారి కిది యొకటే చేసినది, చేయుచున్నది. దీనికిఁదగినట్లు కార్చుటకుఁ గావలసి నన్ని కన్నీళ్లు తెలుఁగువారి కున్నవా యని సందేహపడవలసియున్నది' (పుట 58). ఇంత చెప్పినను ఈ ఉపన్యాసాల చివర 'ఇది పట్టిపై పరామరిక. లోతుకుదిగి చూడవలసినది, చేయవలసినది కొండంతకలదు. నాకన్న శక్తియు, అవకాశమును, అనుకూలతయు గల వారాపని కధికారులు.' (పుట. 78) అన్న శర్మగారి వినయము మేరు సదృశము

'కవికి గీటురాయి వ్యాసం' అన్నాడు హిందీ సాహిత్య చరిత్రకారుఁడు రామచంద్ర శుక్లా.' గద్యం కవీనాం నికషం వదన్తి' అని కదా ప్రాచీన ఆభాణకం. శర్మగారి ఈ వ్యాసాలు చక్కని కళాఖండాలు. శైలి మనోజ్ఞము. అంగులోనూ

లలిత హాస్యం లాస్యం చేస్తూంటుంది. ఆయన తన అభిప్రాయాలను బలవంతంగా పాఠకుడిపై రుద్దటానికి ప్రయత్నించడు. పాఠకులలో వివేచనాశక్తిని పెంపొందింపజేసి మీ మార్గం మీరేఎన్నుకోండి అన్నట్లుంటాయి ఆయన వ్యాసాలు. చెప్పదలచుకొన్న విషయం సూటిగా హృదయానికి హత్తుకొనేటట్లు చెప్పటం ఆయనకుదైన లక్షణం. 'The essay, proper or literary essay is not merely a short analysis of a subject, nor a more epitome, but rather a picture of wandoring minds effected for the moment by the subject with which he is dealing Its most destinctive feature is the egostic element' అంటారు హాల్వర్డు, హిల్లు. (Hallward & Hill) శర్మగారి వ్యాసములపై వాక్యములకు దర్పణప్రాయము లని వేఱుగ జెప్పఁబనిలేదు. 'భావానుకూలంకష మైన శైలీ ప్రాగల్భ్యముతో, నుడికారపు టొడుపులతో ఛలోక్తులతో సుతి మెత్తని మాటలతో సాగిన వీరి విమర్శ, ననసాగిన వీరి రచన పానుగంటి వారి తరువాత తెనుగులో వ్యాసమున కొక ప్రతిష్ఠ తెచ్చిపెట్టా'యని ఆచార్య యస్వీ జోగారావుగారి అభిప్రాయం. (మహతి పు. 269) శర్మగారి వ్యాసములు రసనిష్యందములు.

శర్మగారి రచనలలో ఆఖరివైనను పేర్కొన దగినవి ఆయన వివిధ గ్రంథాలకు వ్రాసిన పీఠికలు. రాళ్లపల్లి 'అభినందన సమితి' తరపున డా॥ R·V·S సుందరం, G. అశ్వత్థనారాయణ గార్లు బహువ్యయ ప్రయాసల కోర్చి 'రాళ్ళపల్లి పీఠికలు' అను పేర నొక చక్కని గ్రంథాన్ని ప్రచురించారు. ఆంధ్రసాహిత్యంలో ఇట్టి గ్రంథ ప్రకటనమునకు ఇదే తొట్టతొలుతది. పూర్వ కావ్యావతారికల స్థానమును ఆధునిక యుగమున పీఠికలు ఆక్రమించినవి. అవతారికలవలెనే గ్రంథ పరిచయము చేయుటకై యివి ఆవిర్భవించినవి. అవతారికలు ఆయా కవులు తమ స్వగ్రంథములకే కూర్చుకొనగా, నీపీఠికలు గ్రంథరచయితలేకాక ఇతరులును రచించినవి. కవిపరిచయమే కాక కావ్యపరిచయము వీనియందు ముఖ్య స్థానము నాక్రమించినది.

వీనియందు కవిత్వ సంబంధ పరామర్శే కాక, సాహిత్య విమర్శకూడ చోటుచేసికొన్నది. కావ్య సౌధాంగణ ప్రవేశమునకు ముందర తీర్చిదిద్దిన రంగవల్లులు పీఠికలు. వారివంశమునకు వేలూరి వారు, భాస్కర రామాయణ-ఆముక్త మాల్యదాదులకు మేదేపల్లివారు, కాండాలి వారి హంపీ క్షేత్రమునకు విశ్వనాథ, గాథా సప్తశతీ సారమునకు దిగుమర్తి వారు, హరిశ్చంద్ర నలోపాఖ్యానానికి వజ్ఝల, కళాపూర్ణోదయమునకు కట్టమంచి, బసవ పురాణమునకు కాశీనాథుని నాగేశ్వర రావు, పండితారాధ్యచరిత్రకు చిలుకూరి నారాయణరావు, క్రీడాభిరామమునకు వేటూరి ప్రభాకరశాస్త్రి, కుమారసంభవానికి మానవల్లి రామకృష్ణకవి సమకూర్చిన పీఠికలు ఆంధ్రసాహిత్యములో పది కాలాలు నిలుచునవి. ఇక రాళ్ళపల్లి వారి పీఠికలు ఒక ప్రత్యేక స్థానమును సముపార్జించుకొన్నట్టివి.

అవి కేవల ప్రశంసాత్మకములు కావు. సాధారణముగ సంక్షిప్తములు, భావ నిర్భరములు. ఏపీఠికైనను మొదట గ్రంథ కర్త పరిచయము, పిదప గ్రంథస్థమైన విషయ విమర్శ, పిదప రచనలో లోటుపాట్లు, చివరకు రచయితకు అభినందన, ప్రోత్సాహము అను రీతి నుండును. 'అవి (పీఠికలు) యథాలాపములు మాత్రం కావు. అవి విషయప్రధానములు విమర్శతత్త్వ సమన్వితములు. సమీక్షా ప్రాయములు. వైయుక్తిక వచన రచనా శిల్ప విలక్షణములు .. పెద్దపీఠికల్లో విషయ ఔన్నత్యం, అభిప్రాయ గాంభీర్యం, పటుత్వం తప్పని సరసవాక్కు, శైలీ సంపన్నత, ప్రధానలక్షణాలు. నిజానికి రాళ్ళపల్లి వారి పీఠికలు ఒకనిర్మితి గలిగి సుందరంగా, శిల్ప శోభితంగా రూపొంది వుంటాయి.

వాటిని విశ్లేషించి పరిశీలిస్తే పీఠికా రచనలో రాళ్ళపల్లి వారిదైన ఒక శిల్పం సుగోచర మవుతుంది' అని ఆచార్య జి యస్. రెడ్డిగారి పీఠికా ర్చ నాభిప్రాయము. (రా. పీ. పు. IX) స్థాలీపులాకంగా వారి పీఠికల నుండి ఒకటు రెండుమాటలు. 'రక్తిలోను విరక్తిలోను సౌందర్యమున్నది. వికారముకూడ రెంటను గలదు. రెండును పరస్పర సంస్కారకములుగ పోషకములుగా ఉండగలవు. ఉండవలయును. ఈ తత్త్వమును గమనింపక పోవుట చేతనే మన దేశమందు చార్వాక మత

మతోఁ గూడ బౌద్ధమతము నశించినది' (రా. శే పు 164). ఇట్టి వెన్నో కలవు వారిపీఠికలలో రాళ్ళపల్లి పీఠికలలో ముఖ్యముగా పేర్కొనదగినవి అకాడెమీ ప్రకటించిన పాండురంగమాహాత్మ్యమును గూర్చి రచించిన విపుల పీఠిక, రాయల్ అండ్ కో వారి శ్రీమదాంధ్ర భాగవతమునకు కూర్చిన పీఠిక. వావిళ్ళ వారి 'వేమన పద్యా'లకు వ్రాసిన పీఠిక ఇంకాఎన్నో పీఠికలు పేర్కొనఁదగినవి.

అనంతముఖంగా సాగిన రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారి రచనలు ఆంధ్ర సరస్వతికి మేలిమి కైసేతలు. అర్ధశతాబ్దముగా ఆంధ్ర సాహితీజగత్తును సుమధుర పరిమళ భరితం చేస్తున్నవి రాళ్ళపల్లి రమణీయ రచనలు. విశ్వనాథ బాణిలో చెప్పాలంటే 'ఒకడు రాళ్ళపల్లి'

'రాళ్ళలో ఒక నవ్యరాగ ముదయిస్తే
పల్లిలో, ఒక భవ్యభావ ముదయిస్తే
రాగభావములు రసయోగాకృతి వహిస్తే
ఆమూర్తి రాళ్ళపల్లి అనంత కృష్ణునిది
ఆస్ఫూర్తి అక్షర శిఖాగ్ర రోచిష్ణునిది'

— డా సి నారాయణ రెడ్డి.

ఉపయుక్త గ్రంథపట్టిక

1. అనంతరాగం - (1977) సం. ఆర్వీయస్ సుందరం, ఘట్టమరాజు. అశ్వత్థ నారాయణ, శివలంక శ్రీ రామ చంద్రమూర్తి

2 రాళ్ళపల్లి పీఠికలు - (1978) సం. ఆర్వీయస్. సుందరం

3. గాథాసప్తశతీ సారము (ద్వి.ము 1964)

4. సారస్వతాలోకము. (ప్ర. ము 1954)

5 నాటకోపన్యాసములు. (తృ ము. 1954)

6 వేమన (ప్ర. ము. 19 9).

— —

# జానపద విజ్ఞానము - తెలుగు జానపద సాహిత్యము

— శ్రీ డా॥ జి. యస్. మోహన్, ఎం ఏ, పిహెచ్ డి.

ప్రాచీనకాలంలోని విభిన్న సాంస్కృతిక సమూహాల సంస్కృతి వికాసాలను గుర్తించడంలోను, వారి ఆచార వ్యవహారాలు, విశ్వాసాలు, సంప్రదాయాలు, కళలు, సాహిత్యాది విషయాలను గమనించడంలోను మనకు రెండు విధాలైన సామగ్రి లభిస్తున్నది ఒకటి తరతరాలుగా గ్రంథస్థం కాక కేవలం మౌఖిక సంప్రదాయంలోనే నిలచిపోయిన విజ్ఞానం మరొకటి నాగరకతా ప్రవాహానికి లోనై గ్రంథ రూపంలోఉన్న విజ్ఞానం. మొదటిది సాంప్రదాయిక విజ్ఞానం. దీన్నే మనం 'జానపద విజ్ఞానం' అని అంటున్నాము. రెండోది గ్రాంథిక విజ్ఞానం

మానవుడు సంఘజీవి, బుద్ధిజీవి సంఘమంటే సంస్కృతిని ఆచరణలో ఉంచే మనుష్య సమాహారం. అంతేకాక పరస్పరాపేక్షతో తమకు తాము సాంఘిక ఆర్థికరంగాలలో కొన్ని కట్టుబాట్లను నిర్ణయించుకొని ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వంతో నిర్మించుకొన్న మనుష్య సముదాయం సంస్కృతి అంటే సంఘంలో ఒక సభ్యుడుగా మానవుడు ఆ సంఘంలోని అలవాట్లను, ఆచార వ్యవహారాలను, కళాస్వరూపాలను గ్రహించడమని అర్థం. అట్టి మానవ సంఘ సంస్కృతిని అధ్యయనం చేయడమే జానపద విజ్ఞానం ఒక్కమాటలో చెప్పాలంటే మానవ సంఘజీవన విధానాన్ని, ప్రాచీన సంస్కృతిని ప్రతిబింబింప చేసే దర్పణం వంటిది జానపద విజ్ఞానం దీన్నే ఆంగ్లంలో Folklore అంటారు.

మనుష్య జాతిలాగానే జానపద విజ్ఞానం కూడ అతిప్రాచీనమైనా, జానపద లేదా 'Folk' అనే పదసృష్టి మాత్రం ఇటీవలిదే ప్రాచీనులు ఈవిజ్ఞానాన్ని 'Popular Antiquities' అని పిలిచేవాళ్ళు ప్రప్రథమంగా ఈవిజ్ఞానంపై ఆసక్తి కనబరచిన పాశ్చాత్య విద్వాంసులు గ్రిమ్ సోదరులైన విల్ హెల్మ్ మరియు జాకోబ్ వీరు తమ కాలంలో ఉన్న ప్రసిద్ధమైన జానపద కథల్ని సేకరించారు వీరు 'Popular Antiquities' ను 'Vokskunde' అను పేర్తో పిలిచారు ఆతర్వాత William John Thoms అనే ఆంగ్లేయుడు Popular Antiquities అనే పదానికి సమానార్థకంగా 'Floklore' అనే పదాన్ని మొట్ట మొదట ఉపయోగించాడు ఈయన Androse Merton అనే కలం పేరుతో 1846 అగస్టు 22వ తేదీనాటి 'The Athaenium' అనే పత్రికలో ఈ పదాన్ని సూచించాడు.

Foklore అనేది సమస్త పదం Folk మరియు Lore అన్న పదాల సమ్మేళనమే Folklore Thoms అర్థంలో 'Folk' అంటే 'unlettered peasantry' అంటే నిరక్షర కుక్షులగు కర్షకులన్నమాట Lore అంటే పాండిత్యం లేక విజ్ఞానం

Folklore అనే పదాన్నే కొంతమంది Folklife అని కూడా అంటున్నారు దీనికి Swedish భాషలో 'Folkliv' అనీ, జర్మన్ భాషలో 'Voloksleben' అనే సమానార్థక పదాలు వాడుకలో ఉన్నాయి.

జానపద విజ్ఞానాన్ని పలువురు పండితులు పలురకాలుగా నిర్వచించారు B A Bolkin అభిప్రాయంలో 'శుద్ధమయిన వాగ్రూపమైన సంస్కృతిలో ఏదయినా జానపద విజ్ఞానమే'

William K Bascom జానపద విజ్ఞానాన్ని వాగ్రూపకళ లేదా శాబ్దిక కళ అనిపేర్కొని 'మానవశాస్త్ర పరిభాషలో జానపద విజ్ఞానమంటే మౌఖిక ప్రచారంలో ఉన్న పుక్కిటి పురాణాలు, ఐతిహ్యాలు, జానపద కథలు, సామెతలు, పొడుపుకథలు, కవిత్వం, కళాత్మక వ్యక్తీకరణం కలిగిన అనేక ఇతర ప్రక్రియ'లని తెలియచేశాడు. ఎవరెన్ని విధాలుగా జానపద విజ్ఞానాన్ని నిర్వచించినా 'విద్యాగంధంలో లేని సామాన్య ప్రజల్లో అనేక రూపాల్లో వాగ్రూపంలోనూ, ఉదాహరణ పూర్వకంగానూ ప్రవహిస్తున్న సంప్రదాయ బద్ధమైన సాంస్కృతిక విజ్ఞానమే జానపద విజ్ఞానం'. ఇది ప్రజల యొక్క ప్రజలచేత, ప్రజల కొరకు వ్యక్తీకరింపబడిన సామూహిక విజ్ఞానం. నిరక్షరాస్యుల అభిరుచులు, అలవాట్లు, ఆచారవ్యవహారాలు, కళలు, నృత్తులు, ఇత్యాదుల నన్నింటిని నిక్షిప్తం గావించుకొన్న విజ్ఞానఖని జానపద విజ్ఞానం.

జానపద విజ్ఞానాన్ని ఐగు ప్రధాన భాగాలుగా విభజించవచ్చు ఇవి మౌఖిక జానపద సాహిత్యం, సాంఘిక జానపదాచారాలు, వస్తు సంస్కృతి, జానపద కళలు, జానపదుల భాష ఇందులో మౌఖిక జానపద సాహిత్యాన్ని కొంతవివరిస్తాను

జానపద శిష్టసాహిత్యాలు రెండూ తెనుగు సంస్కృతియొక్క విభిన్న రూపాలు శారదాదేవి నేత్రద్వయం. ఒకటి నాగరక ప్రగతిని దర్శింపచేసే జ్ఞానచక్షువు. రెండోది అనాగరక సంస్కార వికాసాన్ని సూచించే విజ్ఞాన నేత్రం నిత్యజీవితంలో సామాన్యు డనుభవించే సుఖదుఃఖాలు, అనుభూతులు ఇత్యాదులన్నీ ఒక్కసారిగా పొంగి పొరలి వచ్చిన 'రసమాధురి'యే జానపద గేయసాహితి. నాటి సంఘ చరిత్రనీ, చారిత్రక విశేషాలనీ, భాషా పరిణామాన్ని, తనలో ఇముడ్చుకొన్న 'చైతన్య స్రవంతి'యే జానపద సరస్వతి నెలవంక. చంద్రికలుగా సంగీత సాహిత్యాలతో మేళవించిన 'కవితా ప్రకృతి'యే జానపద సాహిత్య చమత్కృతి ఉవ్వెత్తున లేచే గోదావరీ తరంగిణిలాగా డెందంలో చిందులు త్రొక్కే 'నాట్యమయూరి' జానపద సాహితీ కళామతల్లి

జానపద సాహిత్య సాంస్కృతిక విషయాలలో భారతదేశపు పాత్ర అగ్రగణ్యమైంది ప్రపంచభాషల్లో ఋగ్వేద గ్రంథం అతి ప్రాచీనమైంది. జానపద గేయాలు, వీరగాథలు ఇందు పేర్కొనబడ్డాయి అథర్వణ వేదంలో జానపదుల నమ్మకాలు, మూఢవిశ్వాసాలు, ఆచార వ్యవహారాలు, కర్మకాండలు మంత్రోచ్చారణలు విస్తారంగా ఉదాహరింపబడ్డాయి పంచతంత్ర కథలు జానపద కథలకీ, కట్టుకథలకీ పెట్టిందిపేరు. ఇట్టి కథలకు మాతృదేశము భారతభూమి

రామాయణ మహాభారతాలు రెండూ జానపద కథలకీ, ఐతిహ్యాలకీ మూల కేంద్రాలు ఉపనిషత్తులలోను, జాతక కథలలోను అనేక గాథలు కన్పిస్తాయి బృహత్కథలో జానపదకథలు, కట్టుకథలు అపరిమితంగా ఉన్నాయి అష్టాదశ పురాణాలు ఐతిహ్యం, మతం నమ్మకాలు, మూఢవిశ్వాసాలకు జన్మస్థానం మన ప్రాచీన సాహిత్యాలను పరికించి నట్లయితే నాటి జానపద జీవితచ్ఛాయలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి

జానపద సాహిత్యపు విలువను గమనించినట్లయితే, మౌఖికరూపంలో ఉండే ఈ సాహిత్య సంపదని అక్షరబద్ధం చేయాలనిపిస్తుంది ఇలా చేయడం వల్ల ఈ సాహిత్యం సురక్షితంగా ఉండడమే కాకుండా వివిధ విషయ పరిజ్ఞానులకు వివిధములయిన సామగ్రిని చేకూర్చి పరిశోధనలకు అవకాశం కల్గిస్తుంది

నిశితంగా పరిశీలించినట్లయితే భాషా శాస్త్రజ్ఞులకు ఈక్రింది పరిశోధనాంశాలు తెల్లమవుతాయి

1 ద్రావిడభాషా కుటుంబంలో భాషా పరిణామ క్రమంలో తెలుగు భాషకు ఇతర భాషలతోకల సంబంధం

2 తెలుగులోకల మాండలిక భేదాలు

3 మూలమూల పదాల స్వరూప నిర్ణయం

4 ధ్వనుల మార్పు

5 అన్యదేశాల గుర్తింపు.

6. నాగరీకరణ పద్ధతి - అంటే జానపదుడు తనభాషలో అనాగరకాలని తలచిన పదాలకు నాగరీకరణ పద్ధతి అవలంబిస్తుంటాడు అవి పదాలకు మహాప్రాణత్వం, పదాది అచ్చుకు వకారం చేర్చడం, పదారంభంలో సంయుక్తాక్షరాలను చేర్చడం.

ఒక్క భాషాశాస్త్రజ్ఞులకే కాకుండా మానవ శాస్త్రజ్ఞులకు, మానసిక శాస్త్రజ్ఞులకు, చారిత్రక పరిశోధకులకు అనేక విషయాలను పరిశీలించడానికి జానపద సాహిత్యం ఉపకరిస్తుంది

2 ప్రజల మనస్సుల్ని మార్చివేసే శక్తి జానపద గేయాలకు ఉంది. ప్రచార సాధనంగా కూడా ఉపకరిస్తుంది హిట్లర్ నార్వే రాజధానియైన ఆస్లో నగరాన్ని కేవలం జానపద గేయాల్ని పాడి లోబరచుకొన్నాడట రష్యా, మరియు చైనా విప్లవాల్లోను జానపద గేయాలు ప్రముఖ పాత్రను వహించాయి.

3. జానపద సాహిత్యం ఒక విశ్వకోశం ఇందు లభించని విషయం ఏదీ లేదంటే అతిశయోక్తి కాదు. సాంసారిక జీవనం, బంధుత్వ ప్రేమానురాగాలు, మానవుడు సంఘజీవిగా మెలగాల్సిన విధానం, ఇత్యాదులన్నీ ఈసాహిత్యరూపంలో వెలువడి మార్గదార్శనికత్వాన్ని ప్రసాదించే అక్షయ సాహితీసుధాలహరిగా జానపద సరస్వతి కనబడుతుంది

4 జానపదుల భావాలు, అనుభవాల లాగానే వారి భాషకూడ జీవకళ ఉట్టిపడేటట్లుగా ఉంటుంది. చెప్పదలచుకొన్న ప్రతివిషయమూ హృదయానికి తాకేటట్లుగా సూటిగా చెప్పబడుతుందే కాని, అన్వయక్లిష్టంగా ఉండదు. జానపదుల రచనల్ని వదలిపెడితే, మన తెనుగ

భాషాసాహిత్య స్వరూపంగాని, వికాసం గాని తెలియవు కనుకనే ఈసాహిత్యం ఆంధ్రభాషకు జీవాన్ని, స్థిరత్వాన్ని సిద్ధింపచేసే దివ్యౌషధం

5 జానపదసాహిత్య సౌందర్యాన్ని ఆస్వాదించినపుడు జానపదుల కవనశక్తి శిష్టుల కవనశక్తి కేమాత్రం తీసిపోదనే మర్మాన్ని గ్రహింపవచ్చు

ఇక ఆంధ్రదేశంలో జానపద సాహిత్యాధ్యయనం తెలుగులో ప్రప్రథమంగా 1842 లో వీరగాథల్ని సేకరించి జానపద సాహిత్యంపై ఆసక్తి చూపెట్టిన మహాభావులు C P Brown ద్వార 1868లో Captain M W కార్ తెలుగుసామెతల్ని కొన్నింటిని సేకరించి ఆంధ్రలోకోక్తి చంద్రిక అనే పేరుతో ప్రకటించాడు అదే తెలుగులో ప్రప్రథమ సామెతల సంకలన గ్రంథమని చెప్పబడుతోంది. 1868 లోనే రవిపతి గురుమూర్తి తెలుగుసామెతల సంగ్రహాన్ని ప్రకటించారు.

1874 లో J A Boyal ద్వార Indian Antiquary vol 3 లో ఒక చారిత్రక గేయాన్ని, ఐదుప్రేమగీతాల్ని సేకరించి ప్రకటించారు. అంతకుముందే 1871 లో charles E Gover-Folk songs of India అనే గ్రంథాన్ని ప్రకటించారు కాని అందులో తెలుగు పాటలు మృగ్యాలు. ఈవిధంగా ఆంగ్లేయులు తెలుగుజానపద సాహిత్యంపై ఆసక్తిని కనబరచి తెనుగువారికి మార్గదర్శకులై వారిని జానపద సాహిత్య సేకరణకు పురికొల్పారు

1899 లోను, 1903 లోను శ్రీ నందిరాజు చలపతిరావు గారు స్త్రీలపాటల సంపుటాల్ని ప్రచురించారు వీరి తర్వాత 1905 లో శ్రీమంగు వెంకటరంగనాథరావు గారు స్త్రీలపాటల్ని అచ్చువేశారు. శ్రీ M N Venkataswamy 'Some Telugu folk Songs' మరియు 'Some Telugu Nursery folk songs and Catches' అనే పేర్లతో కొన్నిపాటల్ని సేకరించి ప్రకటించారు.

శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావుగారు 'ఆంధ్రపదములు, పాటలు' అనే పేర్తో వ్యాససంకలనాన్ని 1924 లో ప్రకటించారు. జానపద సాహిత్య సేకరణలో కృషిచేసిన వారిలో ముందుగా చెప్పదగిన వారు శ్రీ నేదునూరి గంగాధరం గారు వీరు మొత్తం ఆరువేల జానపద గేయాలను సేకరించారట. శ్రీ టేకుమళ్ళకామేశ్వరరావు, శ్రీ శ్రీ పాదగోపాల కృష్ణమూర్తి గారలు లెక్కకు మిక్కుటంగా గేయాలను సేకరించడమే కాకుండా, విమర్శనాయుక్తమైన వ్యాసాలను రచించి భారతి, గృహలక్ష్మి, కిన్నెర మొదలైన పత్రికలను అలంకరించారు శ్రీ హరి ఆదిశేషువుగారు 1954 లో 'జానపద గేయ వాఙ్మయ పరిచయము' అనే గ్రంథాన్ని ప్రచురించారు ఇదే తెలుగు జానపదసాహిత్యాన్ని వివరణాత్మకంగా వెలుగులోనికి తెచ్చిన మొదటి గ్రంథం శ్రీదేవులపల్లి రామానుజరావుగారు' 'సారస్వత నవనీతము' అనే గ్రంథంలో జానపద సాహిత్యంపై కొన్ని వ్యాసాలను రచించారు.

శ్రీమతి వింజమూరి సీతాదేవి గారు జానపదుల సంగీతాన్ని గూర్చి ప్రప్రథమంగా మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి ఎం లిట్ పట్టాన్ని పొందారు. 1956లో లో డా బిరుదురాజు రామరాజుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచీ ప్రప్రథమంగా 'తెలుగు జానపద గేయసాహిత్యం' పై పరిశోధన జరిపి పిహెచ్ డి. పట్టాన్ని పొందారు

1957 లో డా. ఎస్వీ జోగారావు గారు తెలుగు యక్షగానములు, అను విషయంపై వ్యాసాన్ని సమర్పించి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు పట్టాన్ని పొందారు.

1960లో 'త్రివేణి' అను పేర్తో జానపదగీతాల సంపుటి ప్రకటింప బడింది. 1960 లోనే 'పిల్లలపాటలు' 1968 లో 'తెలంగాణాపల్లెపాటలు' అనే సంకలన గ్రంథాలు డా రామరాజు గారి సంపాదకత్వంలో వెలువడ్డాయి.

1965 లో శ్రీకర్ణ రాజేశ్వరరావు గారు 'తెలుగులో జానపదగీతాలు' అనే అంశంపై హిందీభాషలో పరిశోధనవ్యాసాన్ని సమర్పించి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచీ పిహెచ్. డి పట్టాన్ని పొందారు డా తంగిరాల వెంకటసుబ్బారావుగారు 'తెలుగు వీరగాథా కవిత్వం' అనే పరిశోధనల్ని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించి డాక్టరేటు పట్టాన్ని సంపాదించారు.

1970 లో డా నాయని కృష్ణకుమారి గారు తెలుగులో గాథాగేయాలు అనే అంశంపై సిద్ధాంత వ్యాసాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించి పిహెచ్. డి. పట్టాన్ని పొందారు డా తూమాటి దోణప్ప గారు లెక్కకు మిక్కుటంగా గేయాలను సేకరించారు. అనేక వ్యాసాలను ప్రకటించారు

1973 లో డా ఆర్వియస్ సుందరం 'తెలుగు కన్నడ భాషలలో జానపదగీతాలు' అనే విషయంపై సిద్ధాంతవ్యాసాన్ని మైసూరు విశ్వవిద్యాలయానికి సమర్పించి డాక్టరేటు పట్టాన్ని పొందారు 1974 లో శ్రీ వై రఘురామారెడ్డిగారు పల్లెపదాలలో ప్రజా జీవనం' అనే అంశంపై ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి పిహెచ్ డి. పట్టాన్ని స్వీకరించారు

బెంగుళూరు, ఉస్మానియా విశ్వవిద్యాలయాలలో జానపద సాహిత్యంపై పరిశోధనలు చురుకుగా సాగుతున్నాయి. ఇటీవలనే ఈ వ్యాసరచయిత 'అనంతపుర మండల స్త్రీలపాటలు' అన్నవిషయంపై పరిశోధన జరిపి బెంగుళూరు

విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ సంపాదించారు.

భారతి, కిన్నెర, గృహలక్ష్మి, ప్రతిభ, సౌభాగ్య, గోల్కొండ, ప్రజామిత్ర, స్రవంతి, ఆంధ్రప్రభ వారపత్రిక మొదలైన పత్రికలు తెలుగు జానపద సాహిత్యాన్ని ప్రోత్సహించాయి. ఆంధ్ర సారస్వత పరిషత్తు, విశాలాంధ్ర ప్రచురణలు ఈ సాహిత్యం పట్ల శ్రద్ధ చూపాయి. జానపద గేయాలను గుజిలీ పాటల పుస్తకాల రూపంలో ప్రచురించిన ప్రకాశకు లెందరో ఉన్నారు.

1972 లో 'ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు' హైదరాబాదులో నెలకొల్పబడింది. దీని శాఖలు ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాలలోను ప్రారంభింప బడుతున్నాయి.

ఇంతవరకు జరిగినకృషి కేవలం పక్షివీక్షణం వంటిది. ఇంకా జరగాల్సినదెంతో ఉంది. నేటి వరకు గేయ సేకరణల పైనే విజ్ఞుల దృష్టి నిలపడం శోచనీయం. జానపద కథలు, గేయకథలు, గద్యకథనాలు, సామెతలు, పొడుపు కథలు సేకరించి ప్రకటించడం అత్యావశ్యకం. ఇంకనూ జానపద విజ్ఞానాంశాలయిన జానపదుల కళలు జానపదుల భాష, జానపదుల సాంఘికాచార వ్యవహారాలు, జానపదుల క్రీడలు, వినోదాలు, జానపదుల వైద్యం, జానపదుల వస్తు సంస్కృతి ఇత్యాదుల సేకరణ, ప్రచురణ జరుగవలసి ఉంది.

ఋతుషట్కము :

# శరన్నీరాజనము

— శ్రీమతి జి. కమలారాఘవన్.

---

శ్రీ నిలయంబై గోచెను
వానలు వెనుకాడె ధరణి పంకము
లెడలెన్
దనరు శరత్తున నదులును
తనుతను వహియించె ప్రకృతిధర్మము
లగుచున్.

తెలిమబ్బు లల్లన తేలియాడెను దూగి
పింజలై వియవీథి స్వేచ్ఛ మీఱ
చంద్రకాంతిమణులు జాలులుగా పారె
వెండిసీరను భ్రాంతి నిండుకొనగ
మలయుచకోరము ల్మానసమునఁ బొంగ
పాలుపు వెన్నెలసోన భుక్తి కాగ
జక్కవ మిథునముల్ మక్కువ చెలరేగి
ప్రణయవార్ధి నిదేలె ప్రభుత మెరయ

కలకదేరిన కొలకుల కలువ చెలులు
పిల్లతరగల తూగాడు విధముదోచి
అవని నెలగోజు గోబూచులాడ నీట
నలరె శారద చంద్రికా విలసనంబు.

పాలయులుకలు దీరగతమి
వలరాయనిబంటులగుచు ప్రణయాంబుధిలో
వెలసిరి మిథున చయంబులు
సలలిత రాగానుభూతి శారద వేళన్.

అరుదుగ జామిఫలమ్ములు
ఉరవగు సీతాఫలములు నూర్జితమగుచున్
కరము ఫలించిన వెల్లెడ
గురుగతి రసనాంచలముల కోరిక దీరన్.

వేకువ మజ్జనంబులను
వేడుకసల్పియు క్రొత్తవస్త్రముల్
తేకువదాల్చి భక్తి మెయి
దేవి సరస్వతి పూజసల్పి సే
వాకలనన్ నివేదనల
వాసి నొసంగియు మూలయందునన్
గోకను పిన్న పెద్దలను
సొంపు చెలంగిరి ధారుణీ స్థలిన్.

బొమ్మల కొలువులు వెలసెను
తొమ్మిదిరాత్రులనుమించె తోరపు బత్తిన్
ఇమ్ముగ దేవీపూజలు
సమ్మతిదసరా దనరెను సంబర మాచున్

ఉత్తరు సారథ్యంబున
ఉత్తరగోగ్రహణమందు నొప్పుగ విజయుఁ
డుత్తరి కౌరవసేనల
చిత్తుగ నోడించి జయము చేకొనెదశమిన్

కవములు వేయైశ్రాలగ
కరవాలముశూలమునుర కాళియుమహిషా
సురుద్రుంచిన యలయష్టమి
వరదుర్గాష్టమి యనంగ వాసి చెలంగెన్

బాణములంది హస్తముల
బాలురు నొజ్జల వెంటనంటియున్
రాణను వాడ వాడ దస
రాపదముల్ జదువంగ వేడుకన్

కానుకలంది యొజ్జలును
 కాంతు దలిర్పగ పప్పు బెల్లముల్
జానుగ పంచి పెట్టికొను
 సంభ్రమ లీలలు చూడ నొప్పెడిన్.

ప్రాగ్దిశాంగన ప్రీతి వదనాన దిద్దిన
 తిలకంపు చుక్కయై తళుకు మెరయ
మరులు గూర్పగ వచ్చు వలరాజు పట్టిన
 కరదీపమై మింట కాంతి దనర
గగనసుందరి యాడు కరకంగుకం బోచు
 కమనీయగతి నొప్పి కాంతు వెలుగ
తారకావళికింపు తలమానికం బోచు
 పదునారు కళలును ప్రజ్వరిల్ల

జారచోరుల శత్రువై సాగుచుండి
విరహిజనులకు వేదన విరియఁ జేసి
నెగడు శారదపూర్ణిమా నిశలయందు
వేలుపుల బవ్వ యీలీలఁ గ్రాలె జగతి

సలిపిరి తులసీ పూజలు
కొలిచిరి దామోదరు హరిహరిమి వెలయున్
చెలువౌ దీపావళులను
వెలిగించిరి దేవళముల విప్రాంగనలున్.

శ్రీకర కార్తీకమునను
వేకువస్నానముల నాడి వీడని భక్తిన్
సోకను పున్నమ చంద్రుని
ప్రాకటముగ గొల్చి రెలమి బ్రాహ్మణ
 వర్యుల్.

శివునకు బ్రీతిగా గభి
 షేకము సల్పియు సోముగొల్చియున్
ప్రవిమల భక్తిమీర నుప
 వాసములుండియు సోమవారమం
దవిరళ భావయుక్తి శశి
 కంత నొసంగియు నూలు పోగులన్
వివిధములైన పూజలను
 వింతగ సల్పిరి కార్తికమ్మునన్.

— —




## కుమారసంభవము (సమూలానువాదము)

[రచయిత శ్రీ డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు, ఎం. ఏ పిహెచ్. డి ఆంధ్రశాఖాధ్యక్షులు, ప్రభుత్వ ఆర్ట్సు కళాశాల, రాజమహేంద్రవరము వెల 15 రూ ]

నిసర్గమధురము కవిత్వము. ప్రజ్ఞాభ్యాసముల రాణించునది శాస్త్రము. అట్టి కవిత్వ మిట్టి శాస్త్రజ్ఞానముతో గూడినచో బరిమళము సువర్ణత్వ మందునే. వాఙ్మయాకాశమున వాల్మీకి వ్యాసులు చంద్ర దివాకరులైనచో రసమయ సరస్సులో సహృదయ భావుకులు సరసీజములగుచో నందందు విహరించు కవికల హంసల లీలాంచితముల నేమరువా రెవరు? వెలిమబ్బుల పిండులతో నిర్మలాకాశమున శరత్కాల చంద్రాతపవృష్టిలో నిమీలితార్థనిమీలిత సంఫుల్ల సరసీజ నేత్ర శోభలలో వాఙ్మయ సరస్సులో నీదులాడుచు వెలిమబ్బ ముక్కయో కలహంసయో యను సందేహము గలిగించు కవిరాజహంసము కాళిదాసును మరచువా రెవరు? త్రికాలాబాధితమగు నాతని కావ్యపరిమళము నాస్వాదింపని వారెవరు! అతని రస సరస్సులో మునుకలు వేయనివా రెవరు?

అట్టి వారిలో శ్రీ జొన్నలగడ్డ వారొకరు. కవిత్వమును బట్టి చూచిన సువర్ణములగడ్డవారనవలె ననిపించును ఇంతవరకు కాళిదాస కవిత్వ సౌభాగ్యమును స్పృశించినవా రందరు పైత్యమును జూపగ వీరు శైత్యమును జూపినారని పించును. పద్యరచనలో పద గుంఫనములో వృత్త స్వీకారములో వీరి చాతుర్యము ప్రశంసనీయము. సంస్కృతాంధ్ర భాషల వీరికి గల పదసంపద మిక్కిలి యధికము వీరికి గల యుపాధులను (డిగ్రీలను) బట్టి చూచినచో నట్టి పది యుపాధులకు మించిన పదసంపద విస్మయావహము. సమూలముగ ముద్రించుట వీరికిగల కవిగౌరవమును, రెండింటిని సరిజూడగల యవకాశమును పాఠకుని కిచ్చుటచే గల యాత్మవిశ్వాసమును, వ్యక్తము చేయును

అనువాదము చేయుట దేనికి? భావుకుడైన సహృదయుడు ఆకవి పదబంధము, భావగాంభీర్యము పాత్రచిత్రణ మున్నగు వానిని తలమున్కలుగా ననుభవించి యాస్వారస్యము నణచుకొనలేక పదిమంది కందిచ్చు సత్సంకల్పముతో నారంభించిన యనువాదము సహృదయగ్రాహ్యమై సార్థకమగును. అట్లు కాక వ్యాపారార్థకమగుచో తొలిముద్రణలోని ప్రతులు యథాస్థితిలో నుండును పునర్ముద్రణ సంగట మూలకావ్యము నందలి గౌరవము ప్రతిఫలము కానీక నిలబెట్టుకొన్నట్లుగా గమనింప దగిన విషయము. శ్రీ జొన్నలగడ్డవారి కుమారసంభవము పునర్ముద్రణ నందుట యిట్టి సౌభాగ్యమును సహజమైన దానినిగా వ్యక్తీకరించును సమూలముగ నీసారి ప్రకటించుటచే దీనికి మరికొన్ని ముద్రణ లవసరమగు నను దృఢవిశ్వాసము గల్గును

ఆంధ్రీకరణమును హిమాలయమున కంకిత మిచ్చుట యపూర్వమై వీరికి గల భావౌన్నత్యమును, దేశభక్తిని, వెల్లడించును. వీరి యవతారిక యీనడుమ వెలసిన యాంధ్రకావ్యముల యవతారికల కంటె భిన్నమై యుదాత్తమై యున్నదనవచ్చును. సామాన్యముగ నవతారికలలో నగపడు నాత్మప్రశంస యిందు లేకపోవుట మరొక యుదాత్తమైన విషయము. పుస్తక మాద్యంతము కాళిదాసును స్మృతికి దెచ్చును. ప్రతిపద్యమునను కవికిగల భాషా సంపద పుష్కలమై యగపడును. పండితుల యభిప్రాయములు పాఠకునకు మొదటనే దిగ్భ్రాంతి గలిగించును. అట్టి యసామాన్యుల ప్రశంసల నందుట దీని యుత్కృష్టతను వెల్లడించును.

గ్రంథమాద్యంతము పాఠకునకు విసుగు రానీక చదివించును. 'మద్ధి' (శిప) సుధీకులు, తజ్జ (13) వంటి పదముల విన్యాసము పాఠకుని నిలుపును. ఛందోనియమాదికము కారణము కావచ్చును. 17వ పద్యములో 'ద్యుగంగానది నా భగీరథుడు త్స్మస్థలిలో ప్రవహింప జేసినట్లే నను దెల్పునందు వెలయింతు భవత్కవితన్ మహాకవీ' యనుటలో నిప్పటివరకు వచ్చిన కాళిదాసాను వాదము లన్నిటిలోను (కుమారసంభవము) దాదాపు గ ప్రశంసనీయమైన రీతిలో దెచ్చినవారు వీరే, (కాళిదాస కవితకు, కుమారసంభవమునకు) ప్రథమాను వాదము వీరిదికాదు. కుమార సంభవమునకు అనువాదములు, అనుకరణలు మిక్కిలిగా వచ్చినవి. ఇంత నిర్దుష్ట ప్రాయముగ, ప్రౌఢముగ దెచ్చుటలోని ప్రాథమ్యము వీరిదని గ్రహించిన సరిపోవును. 26 వ పద్యములో 'మిహికాహార్యుడు బిడ్డనిచ్చె తనన్ మృత్యుంజయస్వామికిన్, బహుమాన్యుండగు గాదె యొప్పయిన సంభావించెనే మామ న, య్యహిభూషుండు సనామతన్ బరగు నేన కార్యముం బూనియు, మ్మహనీయుం గృతిభర్త జేసి యిటు సమ్మానించినం జెల్లదే?' ఇందలి భావము కొంత యతివేల మనిపించును. కాని దానిని కవికిగల హిమాలయ గతమైన గౌరవ బాహుళ్యమున సంఛన్నము గావింపవలయును.

1 వ. సర్గలో 13వ పద్యములో భూరి మహీధరుండు, చానను, 3వ సర్గలో 16 పద్యమున 'శ్రీపుత్ర' 41 కలగకుడు, నాలుగవ సర్గము 16వ పద్యమున 'చతురాలాప,' 5వ సర్గమున 19 వ పద్యములో 'అంబిక' 51 లో 'సిగ్గుకతన' వంటివి మూలాధికములు. పద్య నియమము చాలవర కిట్టివానికి గారణములుగా నూహింపవచ్చును. 4వ సర్గలోని చతురాలాపములు మధురాలాప మూలకములు. రెండింటికి భేదముకలదు. 'అంబిక' యని వివాహాత్పూర్వము పార్వతి ననుటంత, సముచితము కాదు.

కుమార సంభవము నింత యపూర్వ మనోహరముగ ప్రౌఢశైలిలో సంతరించిన శ్రీ జొన్నలగడ్డవారు ప్రశంసనీయులు. మేఘసందేశమును గూడ వీరనువదించిన బాగుండు' ననిపించును. స్వతంత్రకావ్య మని యనిపించు ప్రౌఢత సంపూర్ణముగా నిందు కలదు. సోన్మేషమగు వీరి కవితాశక్తి యడవికాపు నందరానిది. మరింతగా ననువాదములు, స్వతంత్ర కావ్యములు, రచింపగల వీరి నిపుణత, శక్తి మున్నగునవి వ్యర్థములు కారాదు. ఇట్టి గ్రంథము ప్రతి గ్రంథాలయమునను, ప్రతివ్యక్తి కడను నిలువదగిన దనుట యసందిగ్ధము. వీరింకను మనోహర కావ్యముల నిట్టి వానిని బహుళముగా రచింతురు గాక.

- శ్రీ ప్రసాద్.

—...—

# ఈ పక్షంలో

## జాషువా కవిత్వంపై సరససంసభలో డా॥ ఆచార్య భావన్ ప్రసంగం!

కోనసీమ సాహితీసంస్థ సమతా రచయితల సంఘం అక్టోబరు 2వ గాంధీ జయంతి సందర్భంగా ఒక సాహిత్య కార్యక్రమం, కవి సమ్మేళనం ఏర్పాటు చేసింది. ఈ కార్యక్రమానికి సమతా రచయితల సంఘ అధ్యక్షులు శ్రీ కొల్లూరి సూర్యనారాయణమూర్తి అధ్యక్షత వహించారు ముఖ్య అతిథిగా స్థానిక ప్రముఖ వైద్యులు డా॥ పి. చిరంజీవిరాజు విచ్చేసారు.

ముఖ్యవక్తగా విచ్చేసిన విజయనగరం. మహారాజా కళాశాల తెలుగుశాఖా ఉపన్యాసకులు డా॥ ఆచార్య భావన్ 'జాషువా కవికోకిలను గురించి, వారి సాహిత్య సేవనుగురించి సుదీర్ఘ ప్రసంగాన్ని వినిపించారు. జాషువా ఖండకావ్యాలు - వాటి విశిష్టత, జాషువా ఇతర కృతులు' పిరదౌసి 'గబ్బిలం' 'శశ్మానవాటిక'- అనువానిపై చక్కని ఉపన్యాసాన్ని వినిపించి సభలో జాషువాను చూపించారు.

తదనంతరం గాంధీజయంతి సందర్భంగా జరగిన కవిసమ్మేళనంలో శ్రీ. యం. ఆశీర్వాదం, డా॥ ఆచార్యభావన్, శ్రీ కొల్లూరి సూర్యనారాయణమూర్తి, శ్రీ చక్కా సత్యనారాయణమూర్తి, శ్రీ ఆసు రాజేంద్ర, శ్రీ. వి. రమణమూర్తి శ్రీకృష్ణస్వామి, శ్రీ వక్కలంక రామకృష్ణ 'శ్రీ' వక్కలంక సీతారాం, శ్రీ పెమ్మరాజు విజయరామచంద్ర), తదితరులు కవితలు వినిపించారు.

చివరగా ప్రముఖసాహితీవేత్త, స్థానిక కళాశాల తెలుగుశాఖ ప్రధాన ఉపన్యాసకులు శ్రీవక్కలంక లక్ష్మీపతి రావు గారు ముఖ్యవక్త ప్రసంగాన్ని అభినందిస్తూ-తమ కవితను వినిపించారు.

సంఘకార్యదర్శి శ్రీ చక్కా సత్యనారాయణమూర్తి వందన సమర్పణతో సభ ముగిసింది. *

# 1979-80 బి. వి. అండ్ కో., వారి ప్రచురణములు

## Telugu Five Pandits Notes

### Intermediate

| | | | |
|---|---|---|---|
| I Year | గద్యభాగము నోట్సు | రు. | 6 - 50 |
| ,, | ఉపవాచకము నరమేధము నోట్సు | రు. | 8 - 00 |
| II Year | పద్యభాగము నోట్సు | రు. | 8 - 50 |
| ,, | నాటకము అశ్వత్థామ నోట్సు | రు. | 3 - 00 |

## ENGLISH

| | | | |
|---|---|---|---|
| I Year | English Notes (Prose & Poetry) | రు. | 7 - 50 |
| ,, | Select short stories (Nondetailed) | రు. | 1 - 50 |
| II Year | English Notes (Prose & Poetry) | రు. | 6 - 75 |
| ,, | Tales from Home and Abroad (Nondetailed) | రు. | 1 - 50 |

## డిగ్రీ తరగతులు

| | | |
|---|---|---|
| B. Com. II Year Telugu Notes (Old Poetry with text) | రు. | 7 - 00 |
| B. A. II Year Telugu Notes (Old Poetry with text) | రు. | 7 - 00 |
| ప్రతిమ B. Com. II Year నాటకము నోట్సు | రు. | 3 - 50 |
| బలరామ విజయము ,, | రు. | 3 - 50 |
| స్వప్నవాసవదత్తము, సుభద్ర B.A. II Year నాటకమునోట్సు | రు. | 7 - 00 |
| I Year Degree Telugu Notes B. Com. (Prose & Poetry) | రు. | 7 - 00 |
| I Year B. Sc. Poetry Notes | రు. | 4 - 00 |
| ,, Prose Notes | రు. | 4 - 50 |
| ,, B. A., Poetry Notes | రు. | 4 - 00 |
| ,, ,, Prose Notes | రు. | 4 - 50 |

For Copies :—

*Publishers :*

# B. V. & CO.,

6-8-7, Innispeta, RAJAHMUNDRY-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.